# విస్డమ్




## సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ **కె.వి.గోవిందరావు** బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

**టి.ఎల్.ఎన్.రావు** బి.ఎస్సి.,

**వి.బాలకుమార్** ఎమ్.ఏ.,బి.ఎల్.,

సహాయులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి

## చందా వివరాలు

జీవిత చందా ............ రూ॥ 400/-

3.సంవత్సరాల చందా ..... రూ॥ 100/-

సంవత్సర చందా .......... రూ॥ 36/-

ఎయిర్ మెయిల్ (1 సం॥) .... రూ॥ 130/-

సీ మెయిల్ (1 సం॥) ........ రూ॥ 75/-

చందా పంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9, దేశికారోడ్, మైలాపూర్, మద్రాస్-600004.

ఫోన్ : 73327

## ఈ సంచికలో

ఫిబ్రవరి 1990



ముఖ చిత్రం:

కలర్ ట్రాన్స్‌పరెన్సీ

ఎ.వి.భాస్కర్

**తెలుగు విస్డమ్ కు ఇది తొమ్మిదవ సంవత్సరం**

## ధ్యానం

# మానవుడు కష్టాలను కోరితెచ్చుకుంటాడు



—జేమ్స్ ఎలెన్

మానవుడు అరిషడ్వర్గములనే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది గుణాలతో ఉద్రేకించి రోషంతో ఆగ్రహించి అష్టకష్టాలను కోరి తెచ్చిపెట్టుకుంటున్నాడు. మనసులో చెలరేగే భావాల వ్యామోహంలో తికమకలు పడిపోతూ వాస్తవిక జీవిత విధానానికి రాజబాటను వదిలి అడ్డదారిని చూసుకుంటాడు. మందగించిన బుద్ధికి త్రోవసరిగా కనపడక తొట్రుపాటులతో నడుస్తూంటాడు. అరిష్టమైన ఆత్మవంచనతో శాంతి సౌభాగ్యాలను పోగొట్టుకుంటున్నాడు. ద్వేషించినవారిపై మరింత ద్వేషంతో పగపడతాడు. తనతో పోరాడేవారితో ప్రతీకార చర్యకు పూనుకుంటాడు. పగతీర్చుకోడానికి ఉద్యమిస్తాడు.

(మిగతా 5 వ పేజీలో)

# ఇంగ్లిషు ప్రాధాన్యత

ఇంగ్లీషు బాష నేడు ఏదో ఒక ప్రత్యేక జాతి, ఒక ప్రత్యేక దేశం మాట్లాడుకునే భాషకాదు. దీనికి ప్రపంచ వ్యాప్తంగా ప్రాధాన్యత ఏర్పడింది. ప్రపంచంలో సగానికి సగం మంది జనం మాట్లాడుకునే వ్యావహారిక భాషగా రూపొందింది. ఒక విధంగా చెప్పాలంటే ఇది ఒక అంతర్జాతీయ భాషగా ఏర్పడింది. ఈనాడు బేసిక్ ఇంగ్లీషు అని చెప్పబడే సులభ శైలి సామాన్య ఇంగ్లీషు భాష ప్రపంచంలో సులభంగా అందరికీ అర్థమవుతుంది.

భారతదేశానికి మరియు ఇతర ప్రపంచ దేశాలకు సంబంధాలను పెంపొందించే లింకు ఆంగ్లేయ భాష. ఈనాడే కాదు, ప్రాచీన కాలంలో కూడా స్వామీ వివేకానందులు వంటి సుప్రసిద్ధ భారతీయ తాత్వికులు మరియు పారమార్థిక పురుషులు భారతదేశపు సంస్కృతిని, గౌరవాన్ని, ప్రభావాన్ని అమెరికా, కెనడావంటి దూరదేశాలలో తమ ఆంగ్లేయ బాషా పటుత్వంతో ప్రకటించారు. స్వాతంత్ర్య పోరాట సమయంలో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నాయకులు విదేశీపాలకులతో ఇంగ్లీషు భాషలో వాదించి పోరాడారు. నేడు కూడా భారతదేశంలో ఉత్తర, దక్షిణ, తూర్పు మరియు పశ్చిమమున నివసిస్తూన్న వివిధ ప్రజల వైజ్ఞానిక మరియు సాంస్కృతిక సమైక్యతకు సహకరిస్తున్నది ఇంగ్లీషు భాషే. ప్రస్తుతం హిందీ భాషను మాట్లాడుకునే ప్రజలకు మరియు ఇతర భాషలు మాట్లాడుకునే ప్రజలకు సమైక్యతను కలిగించే గొప్ప లింకుభాష ఇంగ్లీషు భాష.

ఇంగ్లీషు భాషలో అత్యుత్తమమైన వాఙ్మయం

"ప్రజాపాలిత రాజ్యంలో క్రమశిక్షణ, సహనము, పరస్పరాభిమానం ముఖ్యం."

—జవహర్‌లాల్ నెహ్రూ

సమృద్ధిగా ఉంది. 'నాకు పశ్చిమ దేశాలలో ప్రియమైనదేదైనా ఉంటే ఇంగ్లీషు పండిత ప్రకాండులు, వారి ఇంగ్లీషు వాఙ్మయం' అని ఒకప్పుడు రవీంద్రనాథ్ ఠాగూర్ సగర్వంగా చెప్పాడు. భారతీయ సాంప్రదాయ వాఙ్మయంపై ఆంగ్లేయ వాఙ్మయ ప్రభావం చెప్పనలవికాదు. షెల్లీ, మరియు స్విన్‌బర్న్ వంటి మేధావుల



రచనలతో ఠాగూర్ స్ఫూర్తిని కలిగించుకున్నాడు. బంకించంద్ర స్కాట్‌వల్ల, శరత్ చంద్ర డికెన్స్ వల్ల, ప్రేమ్‌చంద్ హార్డీ వల్ల ప్రభావితులయ్యారు.

ఒక్క వాఙ్మయాభివృద్ధికే కాదు, వైజ్ఞానిక మరియు సాంకేతిక అధ్యయనాలకు, పరిశోధన లకు ఇంగ్లీషు తప్పనిసరిగా ఉండి తీర వలసిందే. భారతదేశపు యూనివర్శిటీలలో విజ్ఞానశాస్త్ర విషయాల అధ్యయనం ఇంగ్లీషు భాషలోనే కొనసాగాలని యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్‌వారు సిఫారసు చేసారు.

ప్రపంచ వ్యాప్తంగా వ్యాపారాభివృద్ధికి వాడుకునే వ్యావహారిక భాష ఇంగ్లీషు. వీటి అన్నిటికంటే మనదేశంలో వ్యాపారరంగంలోను, ఆర్థికరంగంలోను ఇంగ్లీషు భాష వాడకానికి తగినంత ఆధారం ఉంది.

దేశంలో ఇంగ్లీషుభాష హిందీ మరియు ఇతర స్థానిక భాషలప్రగతికి ప్రతికూలంగా ఉంటుందని చెప్పే విమర్శకులు కొందరు ఉన్నారు. ఇది కేవలం వ్యక్తిగత భ్రమ. దేశంలో ఇంగ్లీషు ఉండడంవల్ల హిందీకి ఎంతో ఉపకరిస్తుంది. ఇంగ్లీషు భాషా సంపర్కంతో ప్రగతి, ప్రవృద్ధి పుష్కలంగా ఉంటుంది.

ఆధునిక యుగంలో సౌభ్రాతృత్వం నేటి విధానం అనేది గ్రహించాలి. మనం సంకుచితంగా నాలుగు గోడల మధ్య ఉండనక్కర్లేదు. అంత ర్జాతీయ సంస్కృతిని అవగాహన చేసుకోవాలి. మానవ నాగరికతను విస్తరింపజేయాలి. మారుతూన్న ప్రపంచంలో అనుగుణ్యంగా జీవించడానికి జీవితంలో ఆధ్యాత్మిక విలువను గ్రహించాలి. ఆంగ్లభాషను నేర్చుకోడానికి ఎట్టి దురభిప్రాయం ఉండకూడదు. భారతదేశపు మొట్టమొదటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ 'స్వాతంత్ర్య భారతదేశాభివృద్ధికి గొప్ప సాంస్కృతిక సాంప్రదాయకతగల ఇంగ్లీసు ముఖ్య పాత్రను వహిస్తుంది. ఈ విశ్వైక భాషను మనం నేర్చుకోవాలి. ప్రపంచంలో ఇతర దేశాలతో పరస్పరావగాహనకు ఎంతో తోడ్పడుతుంది' అని చెప్పారు.

అపూర్వ వాఙ్మయాభి వృద్ధిపొందిన ఇంగ్లీషును భారతదేశంలో అందరూ నేర్చుకోవాలి. మన దేశంలో దాని భవిష్యత్తు దేదీప్యమానంగా ఉండాలి.

## రోగులకు పథ్యాన్ని సూచించే కంప్యూటర్లు

ప.జర్మని ఫ్రాంక్‌ఫర్ట్ హాస్పిటల్‌లో ఒక కంప్యూటర్ 60 నిమిషాలకంటె తక్కువ కాలంలో ఒక రోగికి అవసరమైన పథ్యాన్ని సూచిస్తుంది. కంప్యూటర్ లేకపోతే డైటిస్టులకు ఇదే పనికి కొన్నిగంటలు రోజులు కూడా పడుతుంది.

"పాఠశాలలో నేర్చుకునేది విద్యకాదు. నీతో పుట్టి నీతో నశించేదే విద్య"

— ఇందిరాగాంధీ

# పాపువా న్యూగినీ

ప్రపంచంలో గ్రీన్‌లాండ్ తరువాత రెండవ పెద్ద ద్వీపము పశ్చిమ పసిఫిక్ మహాసముద్రంలో న్యూగినీ (New Guinea) ఇది ఆస్ట్రేలియాకి ఉత్తరంగా 160 కి.మీ.ల దూరంలో ఉంది. దీని వైశాల్యం 8,88,150




చ.కి.మీ.లు. 16వ శతాబ్దంలో న్యూగినీని మొదట చూసిన యూరోపియనులు బహుశః పోర్చుగీసు మరియు స్పెయిన్ నావికులే అని చెప్పుకోవాలి ద్వీపంలో పశ్చిమంగా ఉన్న సగభాగాన్ని పశ్చిమ ఇరియాన్ (West Irian) అంటారు ఇది ఇండోనేషియాకు చెందినది. తూర్పు దిక్కుగా ఉండే భాగము పాపువా న్యూగినీ మొత్తం 600 చిన్న చిన్న ద్వీపాలు చేరి ఉంటుంది ఇవన్నీ అగ్నిపర్వతాల వల్ల లేక పగడపు దీవుల వల్ల ఏర్పడి ఉండాలి.

4,62,840 చ.కి.మీ.ల వైశాల్యంగల పాపువా న్యూగినీ ప్రదేశం అంతా పెద్దపెద్ద పర్వత శ్రేణులతో నిండి ఉంటుంది. తడిగాను, బురదగాను ఉండే మైదానాలు, చెట్లు మరియు పొదలతో నిండి ఉంటుంది. చాలామటుకు ప్రదేశం దట్టమైన ఉష్ణమండలపు అడవులు అందువల్ల కొన్ని ప్రదేశాలు ఇంకా కనుగొనబడలేదు. ఇక్కడ వాతావరణం తేమగాను, వేడిగాను ఉంటుంది. మొత్తం ఇక్కడి 34 మిలియను జనాభాలో వివిధ జాతులు చేరి ఉంటాయి. వీరంతా వివిధ భాషలు మాట్లాడుకుంటారు. ఇంగ్లీషు అధికార భాష. నల్లగాఉండే మెలనేషియనులు సాధారణంగా తీరప్రదేశాలలో కనిపిస్తారు ఉన్నివంటి జుట్టుగల పాపువాలు లోతట్టులో నివసిస్తారు చైనీయులు, యూరోపియనులు, పాలినేషియనులు ఇక్కడ నివసించే ఇతర మైనారిటీ జాతులు

## ప్రపంచంలో 10 మిక్కిలి ధనవంతులలో ఆరుగురు జపానీయులు

ప్రపంచంలో ఉన్న పదిమంది మిక్కిలి ధనవంతులలో ఆరుగురు జపాను దేశస్థులు ఒకరు అమెరికను, ఇద్దరు కెనడియన్లు, ఒకరు దక్షిణ కొరియాకు చెందినవారు. సేబూ రైల్వే గ్రూపుకు చెందిన జపాను దేశపు 55 సంవత్సరాల యోషియాకి సుట్స్‌మి లిస్టులో ప్రథముడు. ఇతడి మొత్తం ధనం విలువ 15 బిలియను డాలర్లు (15,000 మిలియను డాలర్లు). లిస్టులో రెండవవాడు 85 సం.ల తైకిచిరో మోరీ. జపానులో గొప్ప ఎస్టేటు స్వంతదారుడు. ఇతడికి ముఖ్యపట్టణమైన టోకియోలో 72 ఆఫీసు భవనాలు ఉన్నాయి.

— ఫోర్బ్స్ మాగజైన్ సౌజన్యంతో

"చైతన్య రూపమైన ఆత్మతత్త్వముతానై
పరమాత్మగా బుజువు పరచుకునేది ప్రజ్ఞానం."

వ్యవసాయమే చాలామందికి ముఖ్య వృత్తి.ఇక్కడ సగ్గుబియ్యము, కందదుంపలు, టారో, చిలకడదుంపలు, కోకో, కాఫీ, కొబ్బరి, రబ్బరు మొదలైనవి ఎగుమతికి విస్తారంగా పండింపబడతాయి. బంగారు, వెండి, మరియు రాగిగనులు చాలా ఉన్నాయి. వీటిని ఇప్పుడు త్రవ్వుతున్నారు. నూనె, సహజవాయువుల వనరులు కూడా ఉన్నట్టు తెలుసుకోబడింది.



దీనికి రాజధాని పోర్టు మోర్స్బై (Port Moresby) చాలా పెద్ద నగరం. సుమారు 1,500,000 మంది క్రైస్తవ మతస్థులు, అర్ధ మిలియన్ రోమన్ కాథలిక్కులు, మిగిలినవారు ప్రొటస్టెంటులు. రాష్ట్రంలో కినా (Kina) చలామణిలో ఉంటుంది. 'ఓ అరైస్ ఆల్ యు సన్స్' అనేది వీరి జాతీయగీతము.

ఆస్ట్రేలియా, జపాను, యునైటెడ్‌స్టేట్స్, పశ్చిమ జర్మనీ, సింగపూరులతో వ్యాపారం కొనసాగిస్తారు. ప్రపంచంలో మూడువంతుల దేశాలన్నీ సభ్యత్వంగల కామన్‌వెల్త్‌లో పాపువా న్యూగినీకి సభ్యత్వం ఉంది. రెండవ ఎలిజబెత్ మహారాణి సర్‌కింగ్‌ఫర్డ్ డైబెలా గవర్నర్ సహాయంతో పేరుకు మాత్రమే రాజ్యానికి అధికారి. ప్రభుత్వాధికారి ప్రధానమంత్రి రబ్బీ నామాలియా. యూనికేమెరల్ పార్లమెంట్ ఒకటి ఉంది. దీనిలో 109 సభ్యులు 5 సంవత్సరాలకు ఒకసారి ఎన్నుకోబడతారు.

ఇక్కడ తలసరి ఆదాయం 729 డాలర్లు. గ్రాస్ నేషనల్ ప్రోడక్ట్ (GNP) 2.4 బిలియను డాలర్లు. GNP లో సుమారు 39 శాతం మాంస వ్యాపారము, కలపకొట్టుట, చేపలు, పొగాకు, చిన్నతరహా పరిశ్రమలవల్ల లభిస్తుంది. 22 శాతం ముఖ్యంగా వ్యవసాయము మరియు చేపల పరిశ్రమనుండి లభిస్తుంది.

స్వయం సమృద్ధికి కావలసినంత శక్తి సామర్థ్యాలు ఉన్నా పాపువా న్యూగినీ అనేక ఆహారపదార్థాల దిగుమతిపై ఆధారపడి ఉంది. బాగా పెరిగిన పట్టణ జనాభా, సరిగా లేని రోడ్లు వల్ల బియ్యము, మరియు ఇతర ఆహారపదార్థాలను దిగుమతి చేసుకోవలసి వస్తుంది. దేశం ఆర్థిక సహాయానికి ఆస్ట్రేలియా మరియు న్యూజిలాండ్ మీద ఆధారపడి ఉంది. ●

(2 వ పేజీ తరువాయి)

మనస్సులో రాగద్వేషాలు కరుడు కట్టుకుపోయి ఉంటాయి. వాస్తవంగా చంపినవాడు తనను తానే చంపుకుని ఆత్మహత్య చేసుకుంటున్నాడు. దారికొట్టి దోచుకుని జీవించే చోరుడు తననుతానే దోచుకుంటున్నాడు. అడవిలో వేటాడి చంపుకు తినే క్రూరమృగం వేటాడి చంపబడుతుంది. నిందమోపినవాడు నిందల పాలవుతున్నాడు. దూషించినవాడు దూషింప బడుతున్నాడు. చంపడానికి తీసినకత్తి తననే పొడుస్తుంది. న్యాయహీనుడైన న్యాయాధికారి పక్షం వాదించే వారుండరు. ఇదే ప్రకృతి ధర్మము. ●

# గుడూచి

డా. హేమాలక్ష్మణ్

వృక్షశాస్త్రంలో గుడూచిని 'టినోస్పోరా కోర్డి ఫోలియా' (Tinospora Cordifolia) అంటారు. ఇది ఒక బహువార్షిక మూలికా విశేషము. దీనిని సంస్కృతంలో అమృత, తెలుగులో తిప్పతీగె, హిందీలో గిలాయ్, తమిళంలో అమృదవల్లి, కన్నడంలో అమరదవల్లి, మలయాళంలో అమరవల్లి, మరాఠీలో గూల్ వేల్ అంటారు.


GUDUCHI

ఈ మొక్క సాధారణంగా మామిడి, వేప మొదలైన పెద్ద పెద్ద వృక్షాలమీద ప్రాకు తుంది. విస్తారంగా గాలివేళ్లు (aerial roots) భూమివైపు దిగుతాయి. దీనికాండానికి సన్నగా బూడిదరంగులో తొడుగు ఉంటుంది. దీనిని తీసివేస్తే లోపలకాండం ఆకుపచ్చగా ఉంటుంది. 5 లేక 10 సెం.మీల వ్యాసంగల ఆకులు గుండె ఆకారంలో ఉండి చివరకు సన్నగా మొనదేలి ఉంటాయి. దీని పువ్వులు లేత ఆకుపచ్చని పసుపు వర్ణంలో ఉంటాయి. కాయలు పచ్చివిగా ఉన్నపుడు ఆకుపచ్చగా పండినప్పుడు ఎర్రటి ఎరుపుగా ఉంటాయి. గుడూచి వ్రేళ్లు, కాడ ముఖ్యంగా ఔషధాలకు ఉపయోగపడతాయి. సాధారణంగా వేసవికాలంలో వీటిని సేకరించి తరువాత అవసరమైనప్పుడు ఉపయోగించుకోడానికి భద్రపరుస్తారు. కానీ ఇది పచ్చగా ఉన్నప్పుడే దీని ఔషధ విలువ అధికంగా ఉంటుంది. గుడూచి కషాయం అనేక ఔషధాలలో ఉపయోగిస్తారు.

అనేక చర్మరోగాల పైపూతలకు, నొప్పుల నివారణకు దీనిని అధికంగా వాడతారు దాహాన్ని కడుతుంది. వాంతులు తగ్గుతాయి. ఆకలిని పుట్టిస్తుంది. మంచి జీర్ణకారి. కడుపులో చేరిన గాలిని పోగొడుతుంది. అధిక ఆమ్లముల వల్ల కలిగిన కడుపులో పుళ్లను మాన్పుతుంది.

ఇది గుండె బలానికి మంచి టానిక్. రక్తాన్ని శుభ్రపరచి రక్తపుష్టిని, వీర్యవృద్ధిని కలిగి స్తుంది. మూత్రపిండాలమీద పనిచేస్తుంది. మధుమేహానికి మంచి ఔషధంగా వాడతారు. చర్మసంబంధమైన వివిధ రోగాలకు గుగ్గులు, తిప్పతీగె, వేపచిగుళ్లు, పసుపు, తుమ్మబెరడు, ఉసిరి సమపాళ్లలో కలిపి కషాయంచేసి త్రాగిస్తారు. విడిచి విడిచి వచ్చే జ్వరాలకు తిప్పతీగె బెరడు, చూర్ణముగానీ, పచ్చి గుడూచితో తయారుచేసిన కషాయంగాని ఇస్తారు. చేదు పొట్ల, వేపచెక్క, నేలములగ. కొడిసెవిత్తులు, తిప్పతీగె సమభాగాలలో కషాయంకాచి తేనె కలిపి పుచ్చుకుంటే పురాణ జ్వరాలు నిశ్శం సయంగా హరిస్తాయి.

క్షయ రోగాలకు గుడూచిని మించిన మూలిక మరొకటి లేదు. కరక, తాడి, ఉసిరిగ, తిప్పతీగ, సన్నరాష్ట్రము, వాయువిళంగాలు, సొంఠి, పిప్పిలి, మిరియాలు సమభాగాలుగా చూర్ణముచేసి సమంగా చక్కెర కలిపి పూటకు అరతులం చొప్పున ఉదయం,

(మిగతా 9 వ. పేజీలో),

"గతకాలపు పరాజయాలు భావికాలపు దిగ్విజయాన్ని రూపొందిస్తాయి."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1 'యునైటెడ్ నేషన్స్ డే' ప్రతీ సంవత్సరం జరుపుకునే దినం·
(ఎ) 30 అక్టోబరు, (బి) 14 నవంబరు, (సి) 24 అక్టోబరు, (డి) 6 జూన్.

2 భారతదేశపు ఏ స్టీల్ ప్లాంటులో 'స్టెయిన్ లెస్ స్టీల్'ను ఉత్పత్తి చేస్తారు?
(ఎ) భిలాయ్, (బి) దుర్గాపూరు, (సి) సేలం, (డి) బొకారో.



3 సంస్కృతంలో పంచతంత్రం రచించినది ఎవరు?
(ఎ) భవభూతి, (బి) జయ్ దేవ్, (సి) విష్ణుశర్మ, (డి) భరత్‌ముని

4 'మోహినీ ఆట్టం' ఏ రాష్ట్రానికి చెందిన సాంప్రదాయక నృత్యము?
(ఎ) ఒరిస్సా, (బి) మణిపూర్, (సి) ఆంధ్ర ప్రదేశ్, (డి) కేరళ

5 తమిళ రామాయణం రచించినది ఎవరు?
(ఎ) ఆండాళ్, (బి) జయంకొండాన్, (సి) కంబన్, (డి) రామానుజులు

6 జయపూర్ దగ్గర డామన్ జ్యోతిలోగల ఆసియాలో మిక్కిలి పెద్ద 'అల్యూమినా కాంప్లెక్స్' ఏ రాష్ట్రంలో ఉంది?
(ఎ) రాజస్థాన్, (బి) మధ్యప్రదేశ్, (సి) ఆంధ్రప్రదేశ్, (డి) ఒరిస్సా.

7 ఈ క్రిందివారిలో ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన మొదటి మహిళ ఎవరు?
(ఎ) మాడమ్ ఫాంటోంగ్ ఫెన్‌టోగ్, (బి) (Mrs) జుంకో టేబీ, (సి) (Mrs) వాండా రుత్ కీవిక్, (డి) (Mrs) తకాషీ ఒసాకీ.

8 గాంధీజీ సూచించిన ప్రకారం - స్వంత ఆస్తి
(ఎ) ఉండాలి కానీ దానికి సీలింగ్ అవసరము,

## 'విసిడమ్' పాతకాపీలు

మార్చి '82, జూన్ '82, డిసెంబరు '82, ఫిబ్రవరి '83, మార్చి '84, మే '84, జూన్ '84, ఆగష్టు '84 నుంచి నవంబరు '84, జనవరి '85, మార్చి '85 నుంచి ఆగష్టు '85, అక్టోబరు '85; జనవరి '86 నుంచి డిసెంబరు '86, జనవరి '87 నుంచి డిసెంబరు '87; జనవరి '88 నుంచి డిసెంబరు '88, జనవరి '89 నుంచి జూన్ '89 కాపీలు మావద్ద ఉన్నవి. 1982 కాపీల వెల రూ. 2.50 లు; 1983 కాపీవెల రూ. 0.75 లు, 1984 కాపీల వెల రూ.8.75లు; 1985 కాపీల వెల రూ. 10.25 లు; 1986 కాపీల వెల రూ. 18.25 లు, 1987 కాపీల వెల రూ. 19.00 లు; 1988 కాపీలవెల రూ. 20.25 లు, 1989 కాపీల వెల రూ. 12.00; రిజిష్టర్ పోస్టులో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 5.00 లు ఖర్చు M.O. పంపాలి— 'రత్నా ఏజెన్సీస్', 9 వేళకారోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సర్క్యులేషన్ మేనేజర్

"ధ్యాన విశ్వాస రహితమైన క్రియ నిర్గంధ కుసుమము వంటిది."

(బి) ప్రభుత్వము వారు దీనిని తీసుకుని సరిసమానంగా పంచాలి, (సి) నిర్మూలింప బడాలి, (డి) ఉండాలి కానీ స్వంతదారులు లోకం శ్రేయస్సు కోసం ట్రస్టీలుగా ఉంటూ దీనిని ఉపయోగించాలి.

## తెలివికి పరీక్ష

1. ఈ క్రింద సూచింపబడిన సంఖ్యలలో ఏ ఏ మూడు వరుస సంఖ్యలు కలిపితే 15 మొత్తం వస్తుందో సూచించండి: 31415926 5258357979
2. పరమాత్రమమైన పరబ్రహ్మమునకు ప్రతీక ఏమిటి?
3. ఆరు పొలాలు దున్నడానికి ఆరుమందికి ఆరురోజులు పడితే ఒక పొలాన్ని దున్న డానికి ఒక మనిషికి ఎన్ని రోజులు పడు తుంది?
4. ఎవరిని సాధారణంగా నోరు తెరుచుకుని చూస్తూ కూర్చుంటారు?
5. దేహం కాని దేహం ఏది?
6. బౌద్ధ మతానికి త్రిపిటకములు, క్రైస్తవ మతానికి బైబిల్ లోని పాతక్రొత్త నిబంధ నలు మూల పీఠ గ్రంథాలు అయితే హిందూమతానికి అటువంటివి ఏవి? అవి ఎన్ని?

## మాటల మహిమ

1. దిగమ్రింగు: నమలకుండా గొంతు దిగు నట్లు మ్రింగుట (ఎ), అపహరించు (బి), త్యజించు (సి), విడిచిపెట్టు (డి).
2. తోపు: వ్యక్తమగుట (ఎ), పుట్టు (బి), తోట (సి), ముదురు ఎరుపు (డి).
3. నలువు: అందము (ఎ), శక్తి కలది (బి), అనురాగము (సి), చిన్నముక్క (డి).
4. నులి: చిక్కు (ఎ), చిన్నది (బి), మెలి (సి), అల్పము (డి).
5. వీసము: పదహారవ భాగము (ఎ), వెలితి (బి), మిక్కిలి తక్కువ భాగము (సి), కొరతపడు (డి).
6. వేగు: తెల్లవారు (ఎ), పుట్టు (బి), బాధపడు (సి), తొందర (డి).
7. వరుస: బంధుత్వము (ఎ), క్రమము (బి), తుల్యత (సి), చిక్కు (డి).
8. వగపు: దుఃఖము (ఎ), శోకము (బి), కీడు (సి), విలాసము (డి).

(జవాబులకు వ పేజీ చూడండి)

## సూర్యరశ్మి కండ్లకు ఆరోగ్యదాయకము



మానవుని శరీరంలో కండ్లకు అధిదేవత సూర్య భగవానుడు. ఆరోగ్యము, బలము, చేతనత్వము అపాదిస్తాడు. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం కళ్ళుమూసుకుని సూర్యుని ఎండ తగిలేటట్లు కూర్చొ మెల్లగా తల ఈప్రక్కనుంచి మరోవైపు త్రిప్పు. పదినిమిషాలపాటు ఎండ సరిగామూసిన నేత్రాలకు తగిలేటట్లు గమనించు.

తరువాత నీడ ప్రదేశంలోకి వెళ్ళి, అయిదు నిమిషాలపాటు అరచేతులతో మూసుకో. కంటి గ్రుడ్లకు ఒత్తిడి తగలనీయకు. దీనివల్ల దృష్టి బాగుపడుతుంది. కంటి అద్దాల అవసరం ఉండదు. అభ్యాసం ఒక నెలరోజులపాటు తప్పక చేయాలి.

"పాముకంటే ప్రమాదమైనవాడు కొండెగాడు,
పాముఎవరిని కరిస్తే వారి ప్రాణాలు పోతాయి, కానీ
కొండెగాడు ఒకరి చెవికొరికితే ఇంకొకరి ప్రాణాలు పోతాయి."

# డా॥ మోక్షగుండం విశ్వేశ్వరయ్య

ఇప్పుడు కర్ణాటకాలో ఒక భాగమైన మైసూరుకు చెందిన సుప్రసిద్ధ ఇంజనీరు, రాజకీయ వేత్త డా. మోక్షగుండం విశ్వేశ్వరయ్య. వివిధ జీవన రంగాలలో తన విశిష్ట ప్రతిభను ప్రదర్శించిన శ్రీ విశ్వేశ్వరయ్య ఆధునిక భారత



నిర్మాతలలో ఒకరు. మైసూరుకు చెందిన కోలార్ జిల్లాలో 'ముద్దన హళ్లి' అనే చిన్న గ్రామంలో 1861 సెప్టెంబరు 15 వ తేదీన శ్రీవిశ్వేశ్వరయ్య జన్మించారు. బాల్యంలో తలిదండ్రులు శ్రీ శ్రీనివాస శాస్త్రి మరియు శ్రీమతి వెంకటమ్మ వీరి జ్ఞానాభివృద్ధికి ఎంతో సహకరించారు.

మేనమామ రామయ్యగారు వీరి విద్యాభివృద్ధికి మిక్కిలి సహాయం చేసారు. బెంగళూరులో ఉన్నత విద్యను అభ్యసించారు. విద్యార్థిగా ఉంటూన్నప్పుడు అవసరమైన ధన సహాయం లేక అనేక చిక్కులను అనుభవించారు. కొంత మంది పిల్లలకు ప్రైవేట్ ట్యూషన్ చెప్పితన ఖర్చులకు కావలసిన ధనాన్ని సంపాదించేవారు.

కళాశాలలో చదువుకుంటూన్న రోజులలోనే బ్రిటిష్ ప్రిన్సిపాల్ చార్లెస్ వాటర్స్ దృష్టిని వీరు ఆకర్షించారు. వీరి నిష్ఠ సమయపాలన ఆ ప్రిన్సిపాల్ మెప్పులను పొందాయి. 1880లో శ్రీవిశ్వేశ్వరయ్య డిస్టింక్షన్‌తో బి.ఏ. పరీక్షలో పాసయ్యారు. తరువాత 1881-1883లో సంవత్సరాల మధ్య పూనే (మహారాష్ట్ర)లో 'ది కాలేజ్ ఆఫ్ సైన్స్'లో ఇంజనీరింగ్ చదివారు. ఇంజనీరింగ్ పరీక్షలో పాసయిన వారిలో వీరు ప్రథమస్థానాన్ని పొందారు.

శ్రీవిశ్వేశ్వరయ్య తన 23వ ఏట బొంబాయిలో పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంట్‌లో అసిస్టెంట్ ఇంజనీరుగా ఉద్యోగంలో చేరారు. 1908లో సూపరింటెండింగ్ ఇంజనీర్ అయ్యారు. ఆరోజు లలో ఇంజనీరింగ్ శాఖలో భారతీయుడు పొందదగిన అత్యున్నత పదవి అది. అనేక నీటిపనరుల కార్యక్రమాలను, పథకాలను రూపొందిస్తూ వాటిని అమలు పరుస్తూ అనేక ప్రాంతాలలో పనిచేసారు ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉన్న సింధ్‌లో సుక్కూర్ నీటి సరఫరా పథకాన్ని 1893లో పూర్తిచేసారు. పూనాలో 1901–1903లో డామ్ తలుపులు తమంతట తామే తెరుచుకొని పనిచేసే పద్ధతిని ప్రవేశపెట్టారు.

( 6 వ పేజీ తరువాయి)

సాయంకాలం తీసుకుంటే క్షయ నివారణమవుతుంది.

దంతక్షయ నివారణకి, టాన్సిల్స్‌కి, కీళ్లనొప్పుల బాధ నివారణకి గుడూచి మంచి ఔషధం. అనేక విధాలైన లివరు రోగాలకు, కామెర్లు, మూత్రసంబంధమైన రోగాలు, గనేరియా వంటి రోగాలకు కూడా గుడూచి ఉపయోగపడుతుంది.

"గొప్పతనంవల్ల తృష్ణ కలుగుతుంది,
మంచితనంవల్ల తృష్ణ తీరుతుంది"

పంటచేలకు సామర్థ్యవంతంగా నీరు కట్టడానికి అనువుగా బ్లాక్ పద్ధతి నీటిపారుదల విధానాన్ని బొంబాయిలో రూపొందించారు. బొంబాయి అంతా ఆ పద్ధతిని అనుసరించి మంచి ఫలితాలను లాభాలను సాధించింది. తరువాత వీరు మైసూరు సంస్థానం దివానుగా ఉంటున్న రోజులలో వాణీ విలాస్ సాగర్ ఆనకట్టక్రింద ఉన్న భూములలో కూడా బ్లాక్ పద్ధతి ప్రవేశపెట్టారు. ఈ నీటి పారుదల పథకం క్రింద ఎంతో భూమి సాగులోకి వచ్చింది

నీటి సరఫరా పథకాలు తయారు చేయుటలో మంచి నిపుణులు శ్రీ విశ్వేశ్వరయ్య ఆనాడు సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా అయిన మోర్లీ . వీరిని సమర్థుడైన ఇంజనీరుగా గ్రహించి అరేబియన్ ద్వీపకల్పంలోని ఏడెన్‌లో నీటిపారుదల సరఫరా పథకాలను తయారు చేసే పనిని వారికి పురమాయించారు.

వరదల వల్ల తమ సంస్థానంలో ఏర్పడుతూన్న విపరీత నష్టాన్ని ఎదుర్కొనే ఉపాయం సూచించమని 1909లో హైదరాబాదు నిజాం నవాబు శ్రీ విశ్వేశ్వరయ్యను ఆహ్వానించారు. హైదరాబాద్ నగరం మధ్య ప్రదేశంలో ప్రవహిస్తూన్న మూసీనదికి 1908లో అనుకోకుండా అకస్మాత్తుగా వరదలు వచ్చి గట్లు తెగి విస్తృత ప్రాంతాలకు అపారమైన నష్టం ఏర్పడింది.

శ్రీ విశ్వేశ్వరయ్య సూచనను అనుసరించి హైదరాబాదుకి 24కి.మీ.లు దూరంలో ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్ అనే రెండు రిజర్వాయర్‌లు కట్టించడానికి, ఇంకా ఇతర భద్రతా చర్యలు తీసుకోడానికి పూనుకోవడం జరిగింది. ఒకప్పుడు ఉధృతంగా వరదలు వచ్చే మూసీ ఇప్పుడు హైదరాబాద్‌లో ప్రశాంతంగా గట్లు తెగిపోకుండా ప్రవహిస్తూంది.

తన 41వ ఏట శ్రీ విశ్వేశ్వరయ్య మైసూరు సంస్థానానికి చీఫ్ ఇంజనీరు అయ్యారు. వీరు జీవితంలో మిక్కిలి విలువైన కాలాన్ని కన్నంబాడి వద్ద కావేరి నదికి అడ్డంగా ఒక డామ్‌కట్టి నీటిపారుదలకు విద్యుచ్ఛక్తి సరఫరాకు ఉపయోగించే ఒక పెద్ద రిజర్వాయరును నిర్మించడంలో వెచ్చించారు. అదే ఈనాటి కృష్ణరాజసాగర్ డామ్. వారి భావనాశక్తికి ఇది ఒక ప్రత్యక్ష నిదర్శనం.

శ్రీ విశ్వేశ్వరయ్య 1912లో మైసూరు సంస్థానానికి దివాను అయ్యారు. జీవితంలో వివిధ రంగాలలో అనేక పరిశ్రమలకు సాధన సదుపాయాలు కల్పించారు. వీరు నిర్బంధ ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టారు సాంకేతిక, పారిశ్రామిక పాఠశాలలను ఏర్పరచారు.

## ప్రపంచపు టెన్నిస్ ఆటలో మిక్కిలి గౌరవప్రదం



ప్రపంచపు టెన్నిస్ ఆటలో మిక్కిలి గౌరవ ప్రదమైనది వింబుల్డన్ టోర్నమెంట్. ఇది మొట్ట మొదట 1877 లో ప్రారంభింపబడింది. ఈ టోర్నమెంట్ ఆల్ ఇంగ్లండ్ టెన్నిస్ క్లబ్‌వారిచే నిర్వహింపబడుతుంది.

"గొప్పతనంపై ప్రలోభం నశించినవారికి తప్ప మంచితనం యొక్క మాధుర్యం చేజిక్కదు."

చురుకైన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు ఇచ్చి ఉన్నత సాంకేతిక విద్యాభ్యాసానికి సహాయ పడి వారిని విదేశాలకు పంపే ఏర్పాట్లు కూడా చేసారు.

క్రొత్త పరిశ్రమలలో కుటీర పరిశ్రమగా పట్టు పరిశ్రమ, బెంగళూరు, మైసూరులలో చందనపు నూనె ఫాక్టరీలు, సుప్రసిద్ధమైన మైసూర్ శాండల్ సబ్బును తయారు చేసే 'గవర్న మెంట్ సోప్ ఫాక్టరీ' ముఖ్యంగా చెప్పుకో దగ్గవి. మైసూరు విశ్వవిద్యాలయం స్థాపించ డానికి శ్రీ విశ్వేశ్వరయ్య ప్రధాన పాత్ర వహించారు. వీరు ప్రవేశ పెట్టిన గ్రామీణ పరిశ్రమలు గ్రామ ప్రాంతాలలో ఉద్యోగావకాశా లను పెంపొందించాయి. వివిధ జిల్లాలలో పర్యటించి ఇన్‌స్పెక్షన్ చేసే విధానం వీరు మొట్టమొదట ప్రారంభించారు.

శ్రీ విశ్వేశ్వరయ్య చేపట్టిన సంస్థలలో ముఖ్యంగా చెప్పుకోదగినవి భద్రావతి ఐరన్ వర్క్స్. 1923లో వీరు రిటైర్ అయిన తరువాత ఆ సంస్థ నిర్వహణ భాద్యతను చేపట్టి 1929 వరకు దానికి ఛైర్మన్‌గా ఉన్నారు. ఉత్పాదన విధానంలో నూతన పద్ధతులు ప్రవేశపెట్టారు. వారి హయాంలో దాని ఉత్పాదన వ్యయం 50 శాతం తగ్గింది. భద్రావతిలో ఉత్పత్తి అయిన వస్తువులను అమెరికన్ మార్కెట్లలో పోటీ రేట్లకు విక్రయించగలిగారంటే అందులో ఎంతమాత్రం ఆశ్చర్యంలేదు.

విద్య మరియు ఆర్థిక సంబంధమైన అనేక సంస్థల కమిటీలలో కూడా వీరు సభ్యులుగా ఉన్నారు. నీటిపారుదల, నీటిసరఫరాలను గురించిన సమస్యల విషయంలో ఉన్నత స్థాయి సలహా సంప్రదింపులకు ఇండియా అంతటి నుంచి వీరికి ఆహ్వానాలు వచ్చేవి. మనదేశం ఆర్థిక రంగంలో వీరి భావనా శక్తి వలననే ఆల్ ఇండియా మాన్యుఫాక్చరర్స్ అసోసియేషన్ కీలకమైనది. వీరికి సైన్స్ అంటే చాలా అభిలాష.

బెంగళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌లో అనేక పదవులను అదిష్టించారు. ఇన్‌స్టిట్యూట్‌లో అనేక క్రొత్తక్రొత్త డిపార్ట్‌మెంట్‌లను సృష్టించారు.

ప్లానింగ్‌ని గురించి ఎవ్వరూ ఆలోచించని ఆరోజులలో 1930-40 సంవత్సరాల మధ్య ఇండియాలో ప్రణాళికలను అనుసరించి ఆర్థిక పునర్నిర్మాణం జరిగేందుకు ఒక నమూనా పథకాన్ని రూపొందించారు. 1934లో క్రమ బద్ధమైన ప్రగతిసాధన విధానాన్ని సూచిస్తూ ఒక గ్రంధాన్ని ప్రచురించారు. 'రీకన్‌స్ట్రక్టింగ్ ఇండియా' అనే మరో గ్రంథంలో ప్రగాఢమైన వీరి భావాలు, నిర్మాణాత్మకమైన సూచనలు పొందుపరచబడ్డాయి.

(మిగతా 57 వ పేజీలో)

## జపాన్‌లో 36.2 శాతం మహిళలు ఉద్యోగాలు చేస్తారు




ఇప్పుడు జపాన్‌లో 36.2 శాతం మహిళలు ఉద్యోగాలు చేస్తున్నారు. అత్యధికంగా 4.75 మిలియను మహిళలు ఆఫీసులలోను, 4.35 మిలియను మంది ఉత్పాదక సంస్థలలోను, హొటళ్లు మరియు ఇతర సంస్థలలో 4.32 మిలియనుమంది ఉన్నారు.

"మంచితనమునకై తపస్సు చేయువారికి పరిపూర్ణమైన సుఖశాంతులు లభిస్తాయి."

# బంగాళాదుంప

అనేక దేశాలలో బంగాళాదుంప లేక ఉర్ల గడ్డ ఆహారపదార్థాలలో ముఖ్యమైన దినుసు. గోధుమ, వరి, జొన్న, బార్లీ తరువాత బంగాళ దుంప ఒక్కటే ఎక్కువగా పండించేవంట. అనేక పోషకాంశాలు కలిగిన బంగాళదుంప విస్తారంగా పండింపబడుతూండటంవల్ల ఇది




ప్రపంచంలో పెరిగిపోతూన్న జనాభాకు ఆహారపు కొరతను తీర్చడానికి చేపట్టిన తీవ్ర ప్రయత్నాలకు ఎంతో సహకరిస్తుంది. పండింపబడుతూన్న వైశాల్య ప్రమాణాన్ని బట్టి బంగాళదుంప తరువాత సోయాచిక్కుడు వల్ల మనకు అధికంగా ప్రోటీనులు లభిస్తున్నాయి.

కార్బోహైడ్రేటు ఆహారపదార్థంగా పరిగణించబడ్డ బంగాళాదుంపలో అత్యధికంగా పిండిపదార్థాలు ఉండవు. ముఖ్యంగా ప్రోటీనులు, విటమినులు, ఇతర కార్బోహైడ్రేట్ పదార్థాలలో లభించని ఖనిజాలు దీంట్లో లభిస్తాయి. ఇతర ఆహార పదార్థాలలో కంటే ఇందులో వివిధ ఖనిజాల పాళ్లు సమతూకంలో ఉంటాయి.

సొలనేసె (Solanaceae) కుటుంబానికి చెందిన బంగాళాదుంప ఆదిమస్థానము అమెరికా ఖండము. సుమారు 2000 జాతులలో సొలానమ్ ట్యూబరోసమ్ జాతికి చెందినది బంగాళా దుంప, టొమాటో, పొగాకు, ఎగ్‌ఫ్రూట్.

దక్షిణ అమెరికాలో, పెరు మరియు బొలీవియాలోని ఆండీస్ పర్వతప్రదేశాలలోను ఇది పుట్టింది. దక్షిణ అమెరికాలో నివసించే పెరూజాతులు 2000 సంవత్సరాలకు పూర్వం స్పానిష్ దాడికి ముందు దీనిని విస్తారంగా పండించేవారు. కొలంబస్ వచ్చేవరకు బంగాళాదుంప దక్షిణ అమెరికాలో తప్ప ఇతర దేశాలలో పండింపబడేది కాదు. తరువాత యూరప్ మరియు బ్రిటిష్ దీవులలో ప్రవేశించింది. సుమారు ఒక శతాబ్దం ముందు ఇది ఇండియాలో ప్రవేశించింది. ప్రపంచంలో అన్ని దేశాలలోను, అన్నినేలలలోను వివిధ పరిస్థితులలో బంగాళా దుంప పైరు అవుతుంది. చల్లని వాతావరణం, సరైన ఆర్ద్రతగల బలమైన మరియు తేలిక గరువు భూములలో బంగాళాదుంప బాగా ఎదిగి మంచి ఫలసాయాన్ని ఇస్తుంది,

బంగాళాదుంప మూడు లేక నాలుగు మాసాలపాటు పెరుగుతుంది. బంగాళా దుంపకు వ్రేళ్లు బాగా పెరగవు. ఎక్కువ నీరు నిలవ ఉండని ప్రదేశాలలోను, బంక మట్టి నేలలోను ఇది బాగా పెరుగుతుంది. ●

## ధ్యానరహితమైన హృదయం

ఆధ్యాత్మిక చింతన లేనివాడు ఏదేవాలయం ప్రవేశించలేడు. కల్మష హృదయంతో ధ్యానం చేయకుండా ఉండటం ఎంతో మేలు. దాతృత్వ బుద్ధి లేని ధనికుని కంటే ఉదారబుద్ధిగల నిరుపేద ఉత్తముడు.

"కార్యసాధనకు ఆత్మవిశ్వాసమే ప్రథమసోపానము."

# మన రాష్ట్రాలు

## ఆగ్రా

ఢిల్లీకి 204 కి.మీ.ల దూరంలో ఉత్తర ప్రదేశ్‌లో జమునానది గట్టుపైన ఆగ్రా ఉంది. ప్రాచీనకాలంలో సుమారు 1131 A.D.లో క్రూరుడైన గజనీ మహమ్మదు దానిని మంట పెట్టునంతవరకు ఇచ్చట రాజపుత్ర వీరులు నివసించారు. మూడువందల సంవత్సరాల తరువాత ఆఫ్ఘన్ సుల్తాను సికిందర్‌లోడీ ఆగ్రాను తన రాజ్యానికి ముఖ్యపట్టణంగా చేసుకున్నాడు.


TOMB OF ITMAD-UD-DAULA

మొగలాయి వంశస్థాపకుడైన బాబరు కాలంనుంచి ఆగ్రా మొగలాయీల ముఖ్య పట్టణంగా విరాజిల్లింది. మధ్య ఆసియాలో బాబర్ మిక్కిలి అభిలషించిన సమర్కండ్‌కు ప్రతిరూపముగా అనేక అందమైన వనములు, చెరువులు నిర్మించి ఆగ్రాను ఒక సుందరమైన నగరంగా రూపొందించాడు. ఇతడు ఆగ్రాలో తన 'వనభవనం'లో డిసెంబరు 26, 1530 లో మరణించాడు. మొగలు చక్రవర్తులలో ప్రముఖుడైన అక్బరు చాలాకాలంపాటు ఆగ్రాలో నివసించాడు. ఇతడు అనేక పెద్ద పెద్ద భవనాలను, ఒక కోటను కూడా ఇక్కడ నిర్మించాడు. ఇతడి మనుమడైన షాజహాన్ ఆగ్రాలో ప్రపంచపు 7 వింతలలో ఒకటైన, తాజ్‌మహల్ పాలరాతి భవనాన్ని కట్టించాడు.

ఆగ్రాలో ప్రకృతి రమణీయమైన కొండల మధ్య పెర్ల్ మాస్క్ మిక్కిలి అందమైనది. కానీ తాజ్‌మహల్ ముందు దీని అందం క్షీణించిపోతుంది. షాజహాన్ రూపవతైన తన భార్య ముంతాజ్ మహల్ జ్ఞాపకార్థం దీన్ని నిర్మించాడు. నాలుగుకోట్ల రూపాయల ఖర్చుతో దీనిని నిర్మించుటకు ఇరవై సంవత్సరాలు




పట్టింది. ఇచ్చట బ్రహ్మాండమైన డోముక్రింద భార్యా భర్తల సమాధులు ఒకదానిప్రక్క మరొకటి ఉంటాయి. చుట్టూ చిన్న చిన్న రంధ్రములు గల పాలరాతిగోడ కట్టబడింది. ప్రపంచంలో పర్షియా, టర్కీ, ఫ్రాన్స్ మరియు ఇటలీ మొదలైన ప్రదేశాలనుండి శిల్ప నైపుణ్యులను ఆహ్వానించి చక్రవర్తి దీనిని నిర్మించాడు.

ఆగ్రాలో మరియొక అద్భుతమైన నిర్మాణం జహంగీరు చక్రవర్తిని మోహించిన నూర్జహాన్ తండ్రి ఇట్మాడ్-ఉద్-దౌలా సమాధి. పారదర్శక మైన చలువరాతితో చికాన్ కళతో ఈభవనం ఉట్టిపడుతూంటుంది.

ఆగ్రాకు 8 కి.మీ.ల దూరంలో సికంద్రాలో అక్బరు చక్రవర్తి సమాధి అనేక అంతస్థులు

"పుణ్యకర్మలు చేయకపోయినా
పాపకర్మలు చేయకుండా ఉండటం మేలు."

గల బ్రహ్మాండమైన కట్టడం. ఎరుపురంగుగల ఇసుకరాయి మరియు తెల్లని చలువరాతితో దీని నిర్మాణం జరిగింది. ఈ సమాధికి ఒక గోడమీద దేవుని 99 పేర్లు చెక్కబడ్డాయి.



AGRA FORT

ఆగ్రాలో మరియొక పెద్ద భవనము అక్బరు నిర్మించిన రాజకోట. దీనికి తరువాత షాజహాన్ అనేక మార్పులు చేర్పులు చేసి అభివృద్ధి కల్పించాడు. కోటగోడలు మొత్తం చుట్టుకొలత 2.4 కి.మీ.లు. కోటలో ఢిల్లీగేటు, అమరసింగ్ గేటు, గజినీ గేటు మొదలైన గేటులు, జహంగీరు మహల్, అక్బర్ మహల్, శేషమహల్ వంటి మహల్‌లు, భూగర్భ భవనం, పాలరాతి సింహాసనము, అంతఃపురము సభావేదికలు అనేకం ఉంటాయి. అక్బరు కట్టించిన చక్రవర్తిస్నానమందిరంలో ఒక దీపం వెలిగిస్తే అద్దాల గోడనుండి వేలాది దీపాలు వెలుగుతున్నట్లు కనిపిస్తాయి. షాజహాను నిర్మించిన పెర్ల్ మాస్క్ మరియొక సుందరమైన భవనము. స్వచ్ఛమైన పాల రాతితో నిర్మించబడిన అపురూపమైన మాస్కు ప్రపంచంలో ఇదొక్కటే.

ఆగ్రాకు 36.8 కి.మీ.ల దూరంలో అక్బరు చక్రవర్తి రాజధానిగా నిర్మించిన 'ఫతేపూర్‌సిక్రీ' (విజయనగరము) ఈనాడు శిథిలమైన ఇసుక రాతి ప్రదేశంగా ఉంది. ఇచ్చట ఒక కోట, రాజభవనాలు, మాస్కులు ఉన్నాయి. అక్బరు 14 సంవత్సరాల తరువాత నీటిసౌకర్యం లేక దీనిని వదిలినట్లు చరిత్ర చాటుతూంది.

ఆగ్రాలో ప్రజలు సాంప్రదాయకమైన హస్తకళా నైపుణ్యాన్ని అనేక సంవత్సరాలనుండి కాపాడు కుంటున్నారు. వీటిలో పాలరాతి పలకలపై చెక్కిన చిత్రములు, సిల్కుబట్టలు, నగిషీ పనులు, ఎంబ్రాయిడరీ, తివాసీల అల్లకము, చర్మపు వస్తువుల తయారీలు ముఖ్యమైనవి. నగరంలో ప్రతిచోట వంశపారంపర్యంగా ఈ కళలను కాపాడుకుంటున్నట్లు మనం నేటికీ చూడవచ్చు. 60 ఆకర్షక వర్ణాలతో తయారు చేసిన రోజాపుష్పంలోగల అతుకులు సూక్ష్మ దర్శినిలో కూడా కనిపించవు. ఇదే వంశపారం పర్యంగా వచ్చిన వీరి హస్తకళానైపుణ్యము.

ఆగ్రా రకరకాల తినుబండారాలకు చాలా ప్రసిద్ధి పొందింది. కరకరలాడే కారం దాల్ మోత్, తియ్యని రుచికరమైన మెలాన్ పండు ముక్కల వంటి ముక్కలు పేఠా చాలా ముఖ్యమైనవి.

ఢిల్లీనుంచి రైలు, రోడ్డు, విమానాల మీద ప్రయాణాలు చేసి ఆగ్రాను సులభంగా చేరవచ్చు. ●

## భారతదేశంలో 100 kwh శక్తి వినియోగమవుతుంది

ఏదేశంలోనైనా ప్రజల జీవనప్రమాణము అక్కడ వినియోగమయే విద్యుచ్ఛక్తిమీద ఆధారపడి ఉంటుంది. భారతదేశంలో విద్యుచ్ఛక్తి వినియోగ శాతం చాలా తక్కువ. యు.ఎస్.ఏ.లో 8000 kwh శక్తి వినియోగం అవుతూంటే కేవలం 100 kwh శక్తి వినియోగంతో భారతదేశం 113వ స్థానాన్ని పొందుతూంది.

— 'యోజనా' సౌజన్యంతో

"మాటకన్నా మానవీయత మేలు."

# వనితాలోకం

## శరీరకాంతికి

ఒక చెంచాడు పాలపొడిలో కొద్దిగా పన్నీరు, టించర్ ఆఫ్ బెంజాయిన్ రెండు మూడు చుక్కలు కలిపి ముద్దగా తయారు చేయండి,



ఈ స్నోవంటి ముద్దను ముఖానికి పట్టించుకుని 10-15 నిమిషాలు అయిన తరువాత చల్లని శుభ్రమైన నీటితో కడుక్కోండి. ఈ విధంగా వారానికి రెండురోజులు అనుసరిస్తే చర్మం కాంతివంతంగా నవనవలాడుతూ ఉంటుంది.

* * *

## ఎండకు కమలిన ముఖం

నాలుగు చెంచాల టీ పొడి (ఆకులు) ఉడుకుతూన్న వేడినీళ్ళతో వేసి తయారు చేసిన చిక్కటి డికాక్షన్‌తో మందుల షాపుల్లో లభించే జెల్లీ (గ్రీజీ నర్జికల్ జెల్లీ) కలిపితే ఎండకు వాడిపోయి కమలిన ముఖానికి మంచిలోషను తయారవుతుంది.

* * *

## చర్మం ముడతలు పడితే

ఆవాలు 100 గ్రాములు కొద్దిగా వేయించి కాచని తాజాపాలతో ముద్దగా తయారు చేయండి. ఈ ముద్దను శరీరానికి బాగా పట్టించి నలుముకుంటే పిండిరాలుతుంది. అప్పుడు వెచ్చని నీటిలో స్నానం చేయండి. శరీరంమీద ఏర్పడ్డ ముడతలు పోయి చర్మం మృదువుగా కాంతివంతంగా ఉంటుంది.

* * *

## పెసరపిండి క్రీము

బాగు చేసిన రెండు పెద్ద చెంచాల పెసర పప్పు నీటిలో బాగా నానిన తరువాత మెత్తగా రుబ్బి దానిని శరీరానికి పట్టించి ఆరిన తరువాత దులిపి వెచ్చని నీటిలో స్నానం చేయండి. శరీరం మృదువుగా ఉంటుంది. ఛాయ బాగా పెరుగుతుంది.

* * *

## ముఖం మీద మొటిమలు

ముఖంమీద మొటిమలు సర్వసాధారణం జామి ఆకులను వసువుతో ముద్దగా నూరి క్రమంగా రాత్రిపూట పడుకునేటప్పుడు ముఖానికి రాసుకుని ప్రొద్దున్నే కడిగేనుకుంటే

## 500 మిలియను టన్నులు హానికరమైన విషపదార్థాలు ఉత్పత్తి అవుతున్నాయి

ప్రపంచం అంతటా తయారవుతున్న 500 మిలియను టన్నుల హానికరమైన విషపదార్థాలలో 5 మిలియను టన్నులు మాత్రమే అభివృద్ధి పొందుతున్న దేశాలలో తయారవుతుంది.

"రెంటిలో ఒకటి ప్రధానమనుకున్నప్పుడు రెండవదాన్ని విడిచిపెట్టక తప్పదు."

వారం పదిరోజులలో మొటిమలు తగ్గిపోతాయి. మొటిమలు గోళ్లతో గిల్లితే అవిపగిలి ఆచోట మచ్చలు ఏర్పడతాయి. ఈ మచ్చలు పోవాలంటే పుదీనా ఆకు మెత్తగా నూరి రాత్రి పడుకునే ముందు ముఖానికి రాసి ఉదయాన్నే శుభ్రమైన వెచ్చని నీటితో కడిగేయాలి. ఇలా పది రోజుల పాటు క్రమంతప్పకుండా చేస్తే ముఖం మీద మొటిమల మచ్చలు మటు మాయం అయిపోతాయి.

* * *

## జిడ్డు ముఖం

కొందరికి ముఖం ఎప్పుడూ నూనెపట్టించు కున్నట్టు జిడ్డు ఓడుతూంటుంది. పావుకిలో పెసలుగానీ, శనగ పప్పుగానీ, రెండు పెద్ద చెంచాల బావంచాలు, చిన్న కస్తూరిపసుపు ముక్కవేసి, మెత్తగా పొడిచేసి సోపుకు బదులు ఈపిండితో ముఖం రుద్దుకోండి. వెచ్చని నీటిలో నిమ్మరసం పిండి ఆ నీటిలో రెండు రోజుల కొకసారి ముఖం కడుక్కోండి. ముఖం నవనవలాడుతూంటుంది.

* * *

## అరికాలి పగుళ్లు

మర్రిపాలు పగుళ్లకు వేయండి. లేదా మామిడి జిగురు వెచ్చచేసి రసంపిండిన నిమ్మ తొక్కలు పగుళ్లకు రాయండి. కాళ్ల పగుళ్లు మానిపోతాయి.

* * *

## వంటి దురదలు

అరగ్లాసుడు మంచినీళ్లు రాగి చెంబులో పోసి ఉసిరికాయంత చింతపండు ఆ నీళ్లలో నానబెట్టండి. మరునాడు చిక్కటి రసంతీసి వంటికి రాసుకుని అరగంట తరువాత కొంచెం వెచ్చని నీటితో స్నానం చేయండి. దురదలు తగ్గిపోతాయి. నీళ్లలో నిమ్మ రసంపిండి ఆనీటితో స్నానం చేసినా దురదలు తగ్గిపోతాయి.

●

## మోజార్ట్—గొప్ప సంగీత విద్వాంసుడు

మోజార్ట్ ప్రపంచ ప్రసిద్ధి పొందిన గొప్ప సంగీత విద్వాంసుడు. ఇతడు ఒకసారి 'హొలీవీక్' సమయంలో రోమ్‌లో "మిస్సెరెరె" గ్రగోరియా


MOZART

అల్లెగ్రి పాడుతూండగా విన్నాడు. పోప్ దీనిని ప్రపంచంలో మరో ప్రదేశంలో ఎక్కడా ప్రదర్శించ కూడదని నిషేధించాడు. మోజార్ట్ తన గదికి వచ్చి జ్ఞాపకశక్తితో తాను విన్నదాన్ని తిరిగి వ్రాసాడు. పోప్ ఈ అద్భుతాన్ని విని అతనిని గౌరవించి 'గోల్డెన్‌స్పర్' ను బహూకరించాడు. 1791 లో మరణించడానికి ముందు 35 వ సంవత్సరం వయస్సులో ఫిడేలుమీద వాయించడానికి 600 ఒపేరాలు, ఒపేరెటాస్, సొనటా, సెరెనాడెస్, మోటెట్స్, మాసెస్ మొదలైన వివిధరకాల సాంప్రదాయక సంగీత రచనలను రచించాడు.

"కొంపలు అంటుకున్న తరువాత కాదు,
నీళ్లకోసం నూతులు త్రవ్వడం."

# గృహవైద్యము

## వేప

వేపచెట్టు భారతదేశంలో అన్ని ప్రదేశాల లోను సాధారణంగా పెరిగే సతతహరిత వృక్షం. ఇది మెలియేసియా (Meliaceae) కుటుంబానికి చెందినది. ఈ కుటుంబానికి చెందిన మేలియా కాంపోజిటా వైల్డ్ (కొండవేప) పొట్టిగా గుబురుగా ఉంటుంది. 'స్వీటేనియా మహగని' (Switenia mahogani) బ్రహ్మాండంగా



పెరిగే పెద్ద వృక్షం. ఇది ముఖ్యంగా బల్లలు, కుర్చీలు, తలుపులు తయారుచేసుకోడానికి ఉపయోగపడుతుంది. ఈ రెండు జాతులు వైద్యంలో ఔషధాలతయారీకి ఉపయోగపడతాయి. వేపను భారతీయులు అనేక శతాబ్దాలనుంచీ ఔషధాలలో ఉపయోగిస్తున్నారు. మొహెంజొదారో త్రవ్వకాలలో బయల్పడిన తాయెత్తులలో వేపచెట్టు బొమ్మలు ఉన్నట్టు తెలుసుకున్నారు. చరకుడు, శుశృతుడు కాలాలనుంచీ కూడా అయుర్వేద గ్రంథాలలో దీనిని గురించి విస్తారంగా ప్రస్తావించబడింది. వేపకు సంస్కృతంలో అనేక పేర్లు ఉన్నాయి. నింబ, సుతిక్త, పిచుమర్ద, నేత, రవిసన్నిభ, అరిష్ట, క్రిమిఘ్న, పీఘ, చర్దన, సుమన, శీర్షపర్ణ, సుఖప్రియ, కాకఫల, మాలాక, హింగునిర్యాస, పీతసారక మొదలైనవి. తెలుగులో దీనిని వేప, కన్నడంలో బేవు తమిళంలో వేంబు లేక వేప్పం, మలయాళంలో వేప్పు అంటారు. దీనిని వృక్షశాస్త్రంలో అజాడిరఖ్తా ఇండికా (Azadirakhta Indica) అంటారు. దీనినే హిందీలో నీమ్ అంటారు. ఆంగ్లేయ భాషలో దీనికి మార్గోసా అనే పేరు అమర్గోసా (చేదు) అనే పోర్చుగీసుపదం నుంచి ఏర్పడింది. వాస్తవంగా అందరికీ అందుబాటులో ఉన్న మందు వేపమందు. వేపచెట్టు బెరడు, ఆకులు, చిగుళ్లు, పువ్వులు, ఈనెలు, వేపజిగురు, వ్రేళ్లు, కాయలు, పళ్లు అన్నీ ఔషధాల తయారీకి ఉపయోగపడతాయి.

ఆయుర్వేద శాస్త్రం ప్రకారం వాత, పిత్త, కఫ సంబంధమైన రోగాలన్నిటికీ వేప ఒక దివ్య ఔషధం. గుండెజబ్బులు, విదాహము, అలసట, అగ్నిమాంద్యము, వివిధ జ్వరాలకు, కీళ్లవావులకు వేప అమోఘంగా పనిచేస్తుంది. చర్మసంబంధమైన వ్యాధులు, దురదలు, తలలో పేలకు వేపను మించిన ఔషధం లేదు. వేప అమోఘమైన దగ్గునివారిణి. అనేక కంటిరోగాలకు వేపను ఉపయోగిస్తారు.

**కడుపులో క్రిములు:** వరుసగా 5 రోజులు ఉదయంపూట రెండుచెంచాల వేపాకు పసరు త్రాగితే కడుపులో క్రిములు నశిస్తాయి. ఆ పసరులో చిటికెడు ఉప్పు కలిపి త్రాగితే మరింత మంచిది. ఈ పసరు సేవిస్తున్నంత కాలం 12 గంటల వరకు భోజనం చేయకూడదు. తీపిపదార్థం అధికం తినకూడదు.

**మలేరియా:** మలేరియా జ్వరం తగిలిన రోజునుంచి మూడురోజులపాటు వేపపసరు రోజుకి మూడు పూటలు 2 లేక 3 చెంచాలు ఇస్తే మలేరియా జ్వరం నిమ్మళిస్తుంది. తేలికైన

"మరణించినా అనుసరించే స్నేహితుని వంటిది ధర్మం ఒక్కటే. మిగిలినవన్నీ భౌతిక శరీరంతో నశించిపోతాయి."

ఆహారం తీసుకోడం మంచిది. చల్లని పానీయాలు వాడకూడదు.

సాధారణ జ్వరాలు : కప్పు నీళ్లలో పిడికెడు వేపాకులు వేసి ఆ నీటిని సగానికి మరిగించి కషాయం తయారుచేయాలి ఆ కషాయంలో రెండు చెంచాల తేనెను కలిపి త్రాగితే సాధారణ జ్వరాలు తగ్గుతాయి. ఇది త్రాగిన రాత్రి భోజనం మానడం మంచిది.

చర్మవ్యాధులు : వేపాకు, పసుపు సమపాళ్లలో తీసుకుని దానిలో కొద్దిగా ఉప్పువేసి నూరి ఆ ముద్దను గోళీకాయలంత మాత్రలుగా చేసుకుని పరగడుపున మ్రింగాలి. ఇలా వారంరోజులు చేస్తే వివిధరకాల చర్మవ్యాధులు నశిస్తాయి. నలుగు పెట్టుకుని స్నానం చేయడంవల్ల మంచి ఫలితాలు కలుగుతాయి. దీర్ఘకాలపు చర్మరోగాలకు వేపవేళ్ల కషాయం ఉత్తమమైన ఔషధం.

పచ్చకామెర్లు : ప్రారంభదశలో ఉదయం, సాయంత్రం వేప కాడల తేలిక కషాయాన్ని త్రాగితే పచ్చకామెర్లు అతి శీఘ్రంగా తగ్గిపోతాయి. రోగులు నూనె, కారం, పులుపు వాడటం మంచిది కాదు.

నోటి దుర్వాసన, ఇతర దంతరోగాలు : వేప చిగుళ్లను నమలడంవల్ల, వేపకషాయం పుక్కిలించడంవల్ల నోటి దుర్వాసన తగ్గిపోతుంది. ప్రతిరోజు వేప పుల్లతో పళ్లు తోముకుంటే నోటిలో దంతాలు, చిగుళ్లు గట్టిపడతాయి. నోటి దుర్వాసన పోతుంది.

తలలో పేలు : వేపాకు నూరి ముద్దను తలకు బాగా పట్టించి ఆరిన తరువాత తల రుద్దుకుని స్నానం చేస్తే పేలు పడిపోతాయి.

క్షయ : వేపచిగుళ్లు, ఉసిరి నేతితో ప్రతిరోజూ పుచ్చుకుంటే క్షయరోగం నివారిస్తుందని సుప్రసిద్ధ ఆయుర్వేద గ్రంథకర్త చక్రపాణి వ్రాసాడు. వేప కొద్దిగా తీసుకుంటే వాంతులు తగ్గుతాయి. అధికంగా తీసుకుంటే వాంతులవుతాయి. ఎండించి నిల్వ చేసుకున్న వేపపూవు నూనెలో దోరగా వేయించి ఉప్పు కలిపి మొదటిముద్దలో తింటే పిత్తరోగాలు హరిస్తాయి.

మూలశంక : వేపనూనెనుగాని, వేపగింజల ముద్దనుగానీ మూలశంకకు పట్టిస్తే క్రమంగా తగ్గిపోతుంది.

గజ్జి చిడుము : వేపనూనె గజ్జి చిడుమ్ము, తామరలకు ఉపయోగపడుతుంది.

(మిగతా 19 వ పేజీలో)

## స్వంతంగా ఆలోచించు



J. KRISHNAMURTI

పొలాలలో వివిధ పక్షుల కిలకిల రావాలను వింటూ, అడవులలోనడిచి పోతూ, చెట్లను తిలకిస్తూ కోకిల పాటలను వింటూ పోతూంటే, మనస్సులో ఏ ఇతర భావాలు లేకుండా చెట్లను భూమిని చూస్తూ జాగ్రత్తగా పరిశీలిస్తే స్వంతంగా నీ అంతట నీవు ఆలోచించడం నేర్చుకుంటావు. నీలో కలిగిన మార్పులను నీవు ఏ మనోవైకల్యం లేకుండా గ్రహిస్తావు. దీనికి కారణం ఏమిటో నీలో మానవ పరిశీలనాత్మకంగా ఉండే మనస్సులో కాంతి ఏర్పడుతుంది. అట్టి ప్రశాంత సమయంలో ఎక్కడ లేనట్టుగా పరిశుద్ధమైన అంతరాత్మ అనుభవాలలో శాశ్వతమైన సౌందర్యాన్ని సందర్శిస్తావు.

—జె.కృష్ణమూర్తి ఆత్మగతంగా హిస్ లాస్ట్ జర్నల్ లో

"చదివినదానిని, విన్నదానిని ఆచరణలో పెట్టడమే సాధన."

# నిజాలు - నిదర్శనాలు

## 1.05 మిలియను బయోగాస్ ప్లాంటులు ఏర్పాటు చేయబడ్డాయి



గత కొద్ది సంవత్సరాలలో భారత దేశంలో 1.05 మిలియనుకు పైగా బయోగాస్ ప్లాంటులు ఏర్పాటు చేయబడ్డాయి. దీని ఫలితంగా సంవత్సరానికి 4.5 మిలియను టన్నుల వంట చెరకు ఆదా అవటమేగాక సాలీనా రూ. 3,000 మిలియను విలువగల ఎరువులు మరియు విద్యుచ్ఛక్తి జనింపబడుతున్నాయి.

* * *

## ఉత్తరప్రదేశ్‌లో వికలాంగులు అత్యధికం

దేశంలోని మొత్తం 2,76,691 మూగ వారిలో 37,671 మందితో పశ్చిమబెంగాల్ ప్రథమ స్థానాన్ని పొందగా, 30,580 మందితో ఆంధ్రప్రదేశ్ ద్వితీయస్థానాన్ని పొందుతూంది. ఉత్తరప్రదేశ్‌లో అత్యధికంగా 1,64,556 మంది పూర్తిగా వికలాంగులుంటే, మధ్య ప్రదేశ్‌లో 1,01,873 మంది ఉన్నారు. 41,502 మంది కుంటివారితో ఉత్తరప్రదేశ్ ప్రథమస్థానాన్ని పొందుతూంది. తరువాత 35,232 మందితో బీహార్ రెండవ స్థానాన్ని పొందుతూంది. ఉత్తర ప్రదేశ్ 93,618 మంది అంధులతో మొదటిస్థానాన్ని పొందితే, 53,451 మందితో మధ్యప్రదేశ్ రెండవ స్థానాన్ని పొందుతూంది.

* * *

## పంజాబ్ 11 మిలియను టన్నుల గోధుమ పండిస్తుంది

పంజాబ్ నేడు 11 మిలియను టన్నులకు పైబడ్డ గోధుమను పండిస్తూంది.ఇది దగ్గర దగ్గర 1964-65లో మొత్తం దేశంలో పండింప బడిన దానికి సమానము.

* * *

(18 వ పేజీ తరువాయి)

సైనస్: సైనస్‌వల్ల తీవ్రమైన తలనొప్పితో బాధపడేవారు వేపనూనెలో ఇప్పపిండితో చేసిన చిన్నగుడ్డ వత్తిని నానబెట్టి దానిని కాల్చగా వచ్చిన పొగను పీలిస్తే సైనస్ బాధ తగ్గిపోతుంది. హాయిగా ఉంటుంది.

పాముకాట్లు: పాముకాట్లకు గురైనవారికి వేపాకు తీయగా ఉన్నట్టు అనిపిస్తుంది. కానీ వేప ఆకులను నములుతూండగా ఆ రోగి ఎప్పుడు వేప ఆకు చేదుగా ఉందని అంటాడో అప్పుడు విష ప్రభావం తగ్గినట్టు భావించాలి.

వాస్తవంగా ఉల్లి చేసిన మేలు తల్లి చేయక పోయినా వేపాకు చెయ్యగలదు. అనేక రోగాలను నయం చేస్తుంది.

"అవకాశానికి పనికిరాని సామర్థ్యం నిరర్థకం."

## కంప్యూటర్లు, మరియు పెరిఫెరాల్స్ ఉత్పాదన



భారతదేశంలో మొత్తం ఎలక్ట్రానిక్స్ ఉత్పాదనలో కంప్యూటర్స్ మరియు పెరిఫెరాల్స్ ఉత్పాదన ఎనిమిది శాతం మాత్రమే.

* * *

## భారతదేశంలో మిరియాలు ఏలకులవంట

మిరియాలు బ్రెజిల్‌లో హెక్టేరుకి 1,200 క్రి.గ్రా.లు, ఇండోనేషియాలో 550 కి గ్రా లు పండితే భారతదేశంలో 275 కి.గ్రా.లు మాత్రమే పండుతూంది. భారతదేశంలో ఏలకులు హెక్టేరుకి 77 కి.గ్రా.లు పండితే · గౌటిమాలాలో 200 కి.గ్రా.లు అత్యధికంగా పండుతున్నాయి.

—'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

* * *

## ప్రభుత్వరంగం చేపట్టిన పరిశ్రమలలో అప్పులు బదుళ్ళు

మార్చి 31, 1988 నాటికి ప్రభుత్వరంగం చేపట్టిన పరిశ్రమలలో అప్పులు మరియు బదుళ్ళు (loans and debts) రూ 46,952.11 కోట్లు

* * *

## పంజాబ్ - వరి దిగుబడికి ప్రథమస్థానం

మొత్తం వరిసాగు ప్రదేశంలో జాతీయ నగటు 46 24 శాతం - ఎనిమిది రాష్ట్రాలు అధిగమించాయి. వీటిలో 83 23 శాతం వరి సాగుబడి ప్రదేశంతో పంజాబ్ ప్రథమస్థానాన్ని పొందుతూంది. దిగుబడి లేక ఫలసాయాన్ని బట్టి చూస్తే హెక్టేరుకి 32 క్వింటాళ్ల పంటతో పంజాబ్ మొదటి స్థానాన్ని ఆక్రమిస్తూంది.

* * *

## తుంటి ఎముక బలానికి విటమిన C

వృద్ధాప్యం పొందుతున్న కొద్దీ ఎముకల పటుత్వం తగ్గిపోతుంది. అవి శరీరాన్ని నిలబెట్టలేవని నమ్మలేము. కానీ ఇప్పుడు బ్రిటిష్ పరిశోధకులు విటమిన C తుంటి ఎముకను బలపరుస్తుందని నిరూపించారు. తుంటి ఎముకలు విరిగినవారి శరీరంలో ప్రవహించే రక్తంలో C విటమిన ప్రమాణం చాలా తక్కువగా ఉందని పరిశోధనలు చేసి తెలుసుకున్నారు.

ఎముకలలోపల ప్రోలీ హైడ్రాక్సిలేస్ అనే ఎంజైమ్‌కు విటమిన C చాలా అవసరం. దీనివల్లే కొలాజెన్ వంటి కనెక్టివ్ టిష్యూ ఏర్పడి ఎముకను బలపరిచే కాల్షియం తయారవుతుంది. కాబట్టి తగినంత విటమిన C లేకపోతే ఎముకలు కాల్షియంను వినియోగించుకోలేవు.

ముఖ్యంగా విటమిన C లోపం వల్ల కలిగే రోగాలు వృద్ధులలో అధికం. విటమిన C అధికంగా లభించే తాజాపళ్ళు, కూరగాయలు వృద్ధులు అధికంగా వాడి ఎముకల బలం నిలబెట్టుకోవాలి.

—హెల్త్ సౌజన్యంతో

"అపకృతి ఒనర్చినవారిని కూడా దయతో మన్నించడమే మహోత్కృష్టమైన మానవీయత."

## 25,000 మంది ఇంజనీరింగ్ పట్టభద్రులు

భారతదేశం ఇంజనీరింగ్ కాలేజీలన్నిటిలోను ప్రతీసంవత్సరం ఇంజనీరింగ్ మరియు టెక్నాలజీలకు సంబంధించిన వివిధ శాఖలలో ఉత్తీర్ణులైన పట్టభద్రులు 25,000 మందికి పైబడి ఉన్నారు. ఉత్తీర్ణులైన వారిలో సాలీనా 3,477 మందితో తమిళనాడు ప్రథమ స్థానాన్ని పొందుతూంది.

* * *

## యునైటెడ్‌స్టేట్స్ కంటే అధికంగా భాగ్యవంతమైనది

43.7 ట్రిలియన్ డాలర్ల జాతీయ ఆదాయంతో జపాన్ యునైటెడ్ స్టేట్స్ కంటే అధికంగా భాగ్యవంతమైనది. జపాను మొత్తం జాతీయ ఆస్తులలో జపాన్ ఆర్థిక ఆస్తులు 53 శాతం. భూముల విలువ 30.6 శాతం. జపానుకు రికార్డుస్థాయిలో విదేశీ ఆస్తులు 240.7 ట్రిలియన్ డాలర్లు ఉన్నాయి. ఈ విధంగా జపాన్ ప్రపంచంలో బ్రహ్మాండమైన ఋణదాతగా ప్రసిద్ధిపొందింది.

* * *

## భారతదేశంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదకసామర్థ్యత 59,000 MW

భారతదేశంలో 1950లో ఉన్న 1,700 MW విద్యుచ్ఛక్తి ఉత్పాదకసామర్థ్యత 1989లో 59,000 MW కి పెరిగింది. నేడుదేశంలో విద్యుచ్ఛక్తి కొరత 22.64 శాతం. పీకింగ్ షార్టేజి 20.89 శాతం. మనదేశం 1988లో 221 బిలియను యూనిట్ల విద్యుత్తును జనింపచేసింది.

* * *

## కెమికల్స్ మరియు పెట్రోకెమికల్స్ ఎగుమతి

భారతదేశం 1987-88 లో రూ.860 కోట్ల విలువచేసేకెమికల్స్ మరియు పెట్రో కెమికల్స్ ఎగుమతి చేస్తే 1988-89 లో ఇది రూ. 1400 కోట్లకు పెరిగిపోయింది.

## పీత జీవితంలో 20 వివిధ దశలు



ఒక పీత జీవితకాలంలో 20 దశలు ఉంటాయి. ఒక చిన్న గ్రుడ్డులో పెరిగి పైకి వచ్చిన పిల్ల పెద్ద పీతగా పెరగడానికి 20 దశలను పొందుతుంది.

గ్రుడ్డునుండి వచ్చిన లార్వాకు కాళ్ళు ఉండవు. నీటిలో ఈదుతూ ఉంటుంది. సాధారణంగా కొన్నిటిని చేపలు తినేస్తుంటాయి. నీటి మెల్లగా 5 జతల కాళ్ళు పెరుగుతాయి. ఆతరువాత ముందు జత కాళ్ళు డెక్కలుగా మారతాయి. ఈడెక్కలతోనే ఇది సంరక్షించుకుంటుంది.

పీత పెరుగుతున్న కొద్దీ అనేసార్లు పొరవిడుస్తుంది. పైన పెంకుల చేపలను నేరుగుతుంది. సముద్రంలో 200 మీటర్ల లోతుదాకా వెళ్లి రహస్యంగా దాక్కుంటుంది.

— మిహిర్ సోమనాథ్

"మహనీయుల మనస్సు నొప్పించకుండుటయే తన్నుతాను సంరక్షించుకొను మార్గము."

# దివ్యక్షేత్రం - శ్రీశైలము

## రాఘవేంద్రరావు

ప్రాచీన కాలం నుంచీ ప్రసిద్ధి చెందియున్న జ్యోతిర్లింగాలు పండ్రెండు. సౌరాష్ట్రంలో సోమనాథాలయం, శ్రీశైలంలో మల్లికార్జునా లయం, ఉజ్జయినిలో మహాకాళాలయం, ఓంకారంలో అమరేశ్వరాలయం, పరళిలో వైద్యనాథాలయం, ఢాకినీలో భీమ శంకరాలయం, సేతువులో రామేశ్వరాలయం, దారుకావనంలో నాగేశ్వరాలయం, వారణాశిలో విశ్వనాథాలయం,



గోదావరీ తీరంలో త్ర్యంబకేశ్వరాలయం, హిమాలయంలో కేదారేశ్వరాలయం, ఘృష్ణిలో విశాలేశ్వరాలయం. ఈ ద్వాదశ లింగాలను స్మరించిన వారికి ఏడు జన్మలలో చేసిన పాపాలు కూడా పోతాయని పురాణాలలో చెప్ప బడింది. అంతేకాదు కేదారంలో తీర్థాన్ని త్రాగిన వారికి, వారణాశిలో మరణించిన వారికి, శ్రీశైలం శిఖరం చూసినవారికి అసలు తిరిగి జన్మే ఉండదుట.

బహుప్రాచీన కాలం నుంచీ ఒక మహా క్షేత్రంగా పేరుపొందిన ఈ శైల క్షేత్రం ఆంధ్ర ప్రదేశ్ నల్లమల్లై కొండలలో దట్టమైన అడవు లలో విరాజిల్లుతూంది. హైదరాబాదుకి 200-కి మీ దూరంలో ఉన్న శ్రీశైలక్షేత్రం ఎంతో పురాతనమైనది. మహాభారతాన్ని రచించిన మహర్షి వేదవ్యాసుల వారు స్కాందపురాణంలో శ్రీశైలం మహిమను వర్ణించారు.

తలిదండ్రులతో వివాదం పెంచుకుని వెళ్లి పోయిన స్కందుని (కుమారస్వామి, కార్తికేయుడు, మురుగ, సుబ్రహ్మణ్యుడు) వెతుక్కుంటూ పార్వతీపరమేశ్వరులు బయలుదేరారు. స్కందుని కోపం పోగొట్టడానికి పార్వతీ పర మేశ్వరులు శ్రీశైలంలో చాలాకాలం పాటు నివసించ వలసి వచ్చింది. శ్రీశైలంలో ఉండి పోయిన పరమశివుని దర్శించడానికి దేవత లందరూ ఇక్కడికి వచ్చారు. ఆనాటి నుండి ఇదొక పవిత్రమైన దివ్యక్షేత్రంగా మారి పోయింది. ఈ శ్రీశైల క్షేత్రం 12 పవిత్రమైన జ్యోతిర్లింగ క్షేత్రాలలో ఒకటైంది. ఇచ్చట పార్వతీ దేవి భ్రమరాంబగాను, పరమశివుడు మల్లికార్జున స్వామిగాను పూజింపబడుతున్నారు. అష్టాదశ పీఠ శక్తుల రూపాలలో 'భ్రమరి' అవతారమే 'భ్రమరాంబ'

### ప్రపంచంలో మొట్టమొదటి కమర్షియల్ జెట్ ఎయిర్ క్రాఫ్ట్

ప్రపంచంలో బ్రిటన్ మొట్టమొదటి కమర్షియల్ జెట్ ఎయిర్ క్రాఫ్ట్ కామెట్‌ను ఉత్పత్తి చేసింది. దీనిని BOAC (ఇప్పుడు బ్రిటిష్ ఎయిర్‌వేస్ విభాగం) ప్రప్రథమంగా 1958 లో లండన్‌నుంచి జోహాన్స్‌బర్గ్‌కు ప్రయాణీకుల సౌకర్యార్థం ఉపయోగించారు.

"అధికారబలముగల మనుజులతో బలహీనుడు వైరము తెచ్చుకొనుట మృత్యుదేవతను ఆహ్వానించడం వంటిది."

పూర్వం ఇతిహాసకాలంలో వనవాసం చేయవలసి వచ్చినప్పుడు శ్రీరామచంద్ర మూర్తి, అదేవిధంగా పంచపాండవులు శ్రీశైల క్షేత్రాన్ని సందర్శించారు. నేటికీ దేవాలయంలోని పంచపాండవ మంటపాన్ని భక్తులకు చూపిస్తారు. చారిత్రకంగా అద్వైతమత స్థాపకులైన ఆదిశంకరులు, సుప్రసిద్ధ బౌద్ధ మతావలంబుడైన నాగార్జునుడు ఈ క్షేత్రంలో మల్లికార్జున స్వామిని సేవించారు. శ్రీ ఆదిశంకరులు ఇచ్చట శ్రీ చక్ర ప్రతిష్ఠ చేశారు. ఆంధ్రదేశాన్ని పాలించిన శాతవాహనులు, మౌర్యులు, చోళులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు, పల్లవులు, కాకతీయులు, విజయనగర సామ్రాజ్యాధిపతులు కూడా ఈ దేవాలయాన్ని పోషించి సంరక్షించినట్లు తెలుస్తోంది.

12వ శతాబ్దంలో కాకతీయ చక్రవర్తి ప్రతాప రుద్రదేవ ఈ దేవాలయ జీర్ణోద్ధారణ చేపట్టినట్టు వరంగల్‌లో లభించిన శాసనంవల్ల తెలుస్తోంది. తరువాత 15వ శతాబ్దంలో విజయనగరరాజులు కట్టించిన గోపుర ప్రాకార మంటపాలు నేటికీ కనిపిస్తాయి. వీరు ఈ దేవాలయానికి అనేక అభివృద్ధులు చేపట్టి 'రాయగోపురం' నిర్మించారు. శ్రీశైలం భక్త శ్రేణిలో మహారాష్ట్ర వీరుడు భ్రమరాంబ భక్తుడు చక్రవర్తి శివాజీ దీని సంరక్షణకు పాటుపడి ఉత్తర ద్వారంపై పెద్ద గోపురం కట్టించాడు. మహారాష్ట్ర పతనంతో ఈ ఆలయం గోల్కొండ నవాబులైన అక్కన్న, మాదన్న పరిపాలనలోకి వచ్చింది.

శ్రీశైల క్షేత్రంలో చుట్టుపట్ల కొండప్రదేశంలో అమూల్యమైన ఓషధులు, మూలికలు కూడా లభిస్తాయి. దగ్గరలో కృష్ణానదిపై ఉన్న శ్రీశైలం డామ్ వల్ల ఆంధ్రప్రదేశ్‌కి విద్యుచ్ఛక్తి సరఫరా అవుతూంది.

## బీవర్ ఇంజనీరింగ్ నైపుణ్యం

ఉత్తర అమెరికాలో అసాధారణమైన బీవర్ చెరువులలోను, ప్రవాహాలలోను అడ్డంగా 270 మీటర్ల పొడవైన డాములను నిర్మించి నివాస యోగ్యమైన నీటిని భద్రపరచుకుంటాయి. ఈ డామును బ్రహ్మాండమైన ఇంజనీరింగ్ నైపుణ్యంతో పెద్ద దుంగలతో, కర్రలతో, రాళ్లతోను, మట్టితోను నిర్మిస్తుంది.



బీవర్ చెట్లను నరికి పడేస్తుంది. వాడియైన పంటను ఉలి సాధనంగా ఉపయోగిస్తుంది. డాముల నిర్మాణ స్థలానికి కలపను చేరవేయడానికి కాలువలు త్రవ్వుతుంది. చెట్టుకొమ్మలు, గడ్డి వేసి మట్టితో గోడ కడుతుంది. బీవర్ నీటిలో మునిగి ఉన్నప్పుడు శరీరంపై గోధుమరంగు బొచ్చులో నీటి బుడగలు చేరతాయి. ఇవి చలినుండి వేడికి రక్షణను ఇస్తాయి. ఇది తన తోకతో నీటిని కొడుతూ పెద్దశబ్దం చేసి ఇతర బీవర్‌జంతువులకు అపాయ సూచనలను తెలియజేస్తుంది. కాలి వ్రేళ్ల మధ్య చర్మంగల పాదాలతో నీటిలో అతినైపుణ్యంగా ఈదుతుంది. తోకను చుక్కానిగా ఉపయోగించి ప్రక్కలకు పైకి క్రిందకు తనను నియంత్రిస్తుంది.

బీవర్ ముఖ్యంగా విల్లో, బిర్చ్, బార్క్స్, అడవి చెర్రీలను తింటుంది. బాగా పెరిగిన పెద్ద బీవర్ 1.2 మీటర్ల పొడవుగా ఉండి, 27 కి.గ్రా.ల బరువు తూగుతుంది.

"తనను మాలిన ధర్మం, మొదలు చెడ్డ బేరం పనికిరావు."

# ప్రపంచవార్తలు

## నెప్ట్యూన్‌తో వాయేజర్ 2 సన్నిహిత సమాగమము

ఆగస్టు 24 వ తేదిన వాయేజర్ 2 స్పేస్ క్రాఫ్ట్ నెప్ట్యూన్‌కి మిక్కిలి సన్నిహితంగా వచ్చి చేరింది. అప్పుడు వాయేజర్ నెప్ట్యూన్‌కు 4,830 కి.మీ. దూరంలో ఉంది. అయిదు గంటల తరువాత నెప్ట్యూన్ చంద్రులలో ట్రైటాన్ చంద్రునికి 40,230 కి.మీ. దూరానికి వచ్చింది.




1977 లో వాయేజర్ ఆకాశంలోకి ప్రవేశపెట్ట బడిన తరువాత ఈ అపూర్వ సంగమం నాల్గవది, చివరిది. ఇది 1979 లో గురుగ్రహాన్ని, 1981 లో శని గ్రహాన్ని, 1986 లో యురేనస్ గ్రహాన్ని పరిశోధించింది.

* * *

## 2000 సంవత్సరం నాటికి జనాభా 6000 మిలియను

జ్యూరిచ్‌లోని ష్వీజర్ రూయెక్ (Schweizer Rueck) రీఇన్సూరెన్స్ కంపెనీ వారి పరిశోధనా ఫలితంగా 2000 సంవత్సరం నాటికి ప్రపంచ జనాభా 6,000 మిలియను అంటే ఇప్పటి జనాభాకంటే ఒక బిలియను (1000 మిలియను) ఎక్కువ అవుతుందని అంచనా వేయబడింది. ఇప్పటి జనాభా 5 బిలియను (5,000 మిలియను) మందిలో మూడవవంతు దక్షిణ ఆసియాలో, నాల్గవ వంతు తూర్పు ఆసియాలో, పదవవంతు ఆఫ్రికాలో నివసిస్తున్నారు.

* * *

## మధ్య ఇరాన్‌లో 10 బంగారు గనులు

మధ్య ఇరాన్ ఇస్ఫహాన్‌లో మౌటె ప్రదేశంలో భూగర్భ శాస్త్రజ్ఞులు 10 బంగారు గనులను కనుగొన్నారు. దీని సామర్థ్యం 1.2 మిలియనుటన్నులు అని ఊహించబడుతూంది. ఇరాన్‌లో మిక్కిలి ముఖ్యమైన బంగారుగని టెహరాన్‌కి నైఋతి దిక్కుగా 270 కి.మీ.ల దూరంలో మౌటెలో ఉంది.

* * *

## శస్త్రచికిత్సలకు గార్నెట్ క్రిస్టల్ లేసర్

యు ఎస్ ఎస్ ఆర్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ జనరల్ ఫిజిక్స్ పరిశోధకులు శస్త్రచికిత్సలకు గార్నెట్ క్రిస్టల్ లేసర్‌ను కనుగొన్నారు. ఈ క్రొత్త సాధనంలో ముఖ్యవిభాగమైన క్రిస్టల్‌లో అపూర్వమైన ఎర్బియమ్ (Erbium) మూలపదార్థం ఉంటుంది. ఈకొత్త లేసర్ కిరణాలని టిస్యూ కణాలు ఆకర్షించుకుని లోతుగా లోపల ఉండే కణాలకు అపాయం లేకుండా శస్త్రచికిత్సా సామర్థ్యం అధికం చేస్తుంది.

# లైబ్రరీల చరిత్ర

కృష్ణ వేణుగోపాల్

లైబ్రరీలు (గ్రంథాలయాలు) ముఖ్యంగా చదువుకోడానికి వివిధ విషయాలతో కూడిన పుస్తకాలు, దినపత్రికలు, వారపత్రికలు, పక్ష పత్రికలు, మాసపత్రికలు, సంవత్సరాది సంచికలు వంటివి కలిగి ఉంటాయి. శాస్త్ర సంబంధమైన



LENIN STATE LIBRARY

సైంటిఫిక్ గ్రంథాలయాలు కూడా ఉంటాయి. వీటిలో వివిధ రంగాలలో విజ్ఞాన శాస్త్ర సంబంధమైన గ్రంథాలు ఉంటాయి. ప్రతీలై బ్రరీలోను కూడా వివరాలు సులభంగా తెలు సుకోడానికి వీలుగా పుస్తకాలు అమర్చబడి ఉంటాయి. ఇంగ్లీషులో లైబ్రరీ అనే పదం పుస్తకం అని అర్థ మిచ్చే లాటిన్ పదం నుంచి ఏర్పడింది. ప్రభుత్వసంబంధమైన లేక ఇతర ప్రజాసంబంధమైన రికార్డులు, ముఖ్యంగా డాకుమెంట్లు భద్రపరచే నిలయాలను అర్కివ్స్ అంటారు.

ప్రపంచంలో మొట్టమొదట బిసి 21వ శతాబ్దంలో పశ్చిమ ఆసియా బాబిలోనియాలో లైబ్రరీలో బంకమట్టి పలకలు, ఉత్తర ఆఫ్రికా ఈజిప్టులో లైబ్రరీలో కాగితపు చుట్టలు (పెపైరస్ స్క్రోల్స్) సేకరింపబడ్డాయి. బిసి 668-627 లో టర్కీ నుండి పర్షియా వరకు వ్యాపించిన కింగ్ ఆఫ్ అస్సీరియా పేరున నినెవెలో అస్సుర్‌బనిపాల్ లైబ్రరీ, ఇజ్రేల్ జెరూసలమ్ దేవాలయంలో లైబ్రరీ, బిసి 3వ శతాబ్దంలో అలెగ్జాండ్రియా, పెర్గాముమ్‌లలో వరుసగా ఒకటవ టాల్మే మరియు రెండవ యుమెనెస్ స్థాపించిన లైబ్రరీలు ప్రాచీన కాలంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన కొన్ని గ్రంథా లయాలు. నినెవె మట్టిపలకలో బిసి 23వ శతాబ్దానికి చెందిన అగోడె (Agode) వంశపు రాజుల చరిత్ర విదితమవుతూంది. అలెగ్జాండ్రియా లైబ్రరీలో సుమారు 7,00,000 కాగితపు చుట్టలు భద్రపరచబడ్డాయి ప్రాచీన ప్రపంచంలో బ్రహ్మాండమైన లైబ్రరీ ఇదే!

ఈజిప్టు, సిరియా, టర్కీ, మెసపటోమియా ప్రదేశాలలో పురాశిల్ప వస్తుశాస్త్రజ్ఞులు వివిధ మట్టిపలకలు, కాగితపు చుట్టలు కనుగొన్నారు. 22 మట్టిపలకలు ఇంకా లండన్‌లో బ్రిటిష్ మ్యూజియంలో భద్రపరచబడ్డాయి. 1500 బిసినాటికి చైనాలో లైబ్రరీలు స్థాపింపబడ్డాయి. సుప్రసిద్ధ చైనా తత్త్వశాస్త్రజ్ఞుడు మరియు సంఘసంస్కర్త అగు కన్ఫ్యూసియస్ C551-C479 బిసి) కాలంలో లైబ్రరీలు, ఆర్కి వ్‌లు బాగా ప్రసిద్ధి పొందాయి. మొట్టమొదట చైనీయులు వెదురు (చాపలవంటి) షీట్లు మరియు శిల్కు స్క్రోల్స్ మీద వ్రాసారు.

యూరప్‌లో మిక్కిలి ప్రాచీనమైనది, 15 AD శతాబ్దపు వాటికన్ లైబ్రరీ. ప్రస్తుతం ఈ

"ధనాధిక్య ప్రపంచంలో పేదవాడు పడుతున్న బాధలు లాంటివి, పురుషాధిక్యప్రపంచంలో స్త్రీల బాధ."

లైబ్రరీలో సుమారు ఒక మిలియను పుస్తకాలు భద్రపరచబడ్డాయి. అక్స్‌ఫర్డ్‌లో బోడ్‌లీయెన్, పారిస్‌లో బిబ్లియోథిక్ నేషనేల్, లండన్‌లో బ్రిటిష్ లైబ్రరీ ముఖ్యమైన ఆదునిక లైబ్రరీలు

15 AD శతాబ్దం నాటికే కాగితం కనిపెట్టబడి అచ్చుపనులు కొనసాగుతూన్నా గ్రందసేకరణ మరియు గ్రందాలయాలలో పాఠకుల సంఖ్య కూడా చాలా తక్కువగా ఉండేది. 19 వ శతాబ్దం చివరి బాగంలో అచ్చు పరిశ్రమ బాగా ప్రసిద్ధిపొందింది. సార్వజనిక గ్రంథాలయాల (Public Libraries) సంఖ్య అదికమైంది. పాఠకులకు అనేక గ్రంథాలను అందుబాటులోకి తీసుకు వచ్చారు.



LIBRARY OF CONGRESS

ప్రాచీన కాలంలో ఒక స్వంత లైబ్రరీ ఉండడం గౌరవసూచకం. ఇది అంతస్థు పెరుగుదలను సూచించేది. చాలా మందికి వారి వారి ఇండ్లలో స్వంతలైబ్రరీలు ఉండేవి. గ్రీస్ లైసియమ్‌లో అరిస్టాటిల్ స్కూలులో లైబ్రరీ, ఇటలీ ఫ్లోరెన్స్‌లో కోసిమొ డి మెడిసి లైబ్రరీ, ఇంగ్లండ్ డ్యూక్ ఆఫ్ గ్లొసెస్టర్ హంఫ్రీ లైబ్రరీ, యుఎస్ఎలో వర్జీనియా బైర్డ్ ఫామిలీ లైబ్రరీ, యుఎస్ఎ ఫిలడల్ఫియాలో బెంజమిన్ ఫ్రాంక్లిన్, జార్జి వాషింగ్‌టన్ థామస్‌జెఫర్‌సన్ లైబ్రరీలు చాలా ముఖ్యమైనవి. ఈ ప్రైవేటు లైబ్రరీలు చాలావరకు యుద్ధాలవల్ల నశించిపోయాయి. కొన్ని మిగిలినవి యూనివర్సిటీలకు, పబ్లిక్ లైబ్రరీలకు చేర్పబడ్డాయి.

ప్రపంచ వ్యాప్తంగా కొందరు వ్యక్తులు ఇచ్చిన పుస్తకాలతో చిన్న చిన్న లైబ్రరీలు ఏర్పడ్డాయి యునైటెడ్ స్టేట్స్‌లో హార్వర్డ్ లైబ్రరీ, జాన్ హార్వర్డ్ ఇచ్చిన 400 పుస్తకాలతో ప్రారంభమైంది. ఈనాడు ఇది 9 మిలియను గ్రందాలతో ప్రపంచంలో మిక్కిలి పెద్ద లైబ్రరీలలో ఒకటి ప్రపంచ ప్రసిద్ధి పొందిన అమెరికా పారిశ్రామిక వేత్త ఆండ్రూ కార్నీజ్ యునైటెడ్ స్టేట్స్‌లో కార్నీజ్ పేరుతో ప్రతీచోటా ఒక్కొక్క లైబ్రరీ చొప్పున మొత్తం 1,700 ఫ్రీలైబ్రరీలు (ఉచిత గ్రంథాలయాలు) స్థాపించాడు. పశ్చిమ యునైటెడ్ స్టేట్స్‌లో శాన్‌ఫ్రాన్సిస్కో పబ్లిక్ లైబ్రరీ అపూర్వమైన గ్రంథసేకరణకు మరియు సంగీత గ్రంథాలకు పేరు పొందింది

ప్రఖ్యాతి చెందిన అమెరికన్ రాజనీతి తంత్రజ్ఞుడు బెంజమిన్ ఫ్రాంక్లిన్ 1731 లో మొట్టమొదటి చందాలైబ్రరీ ఏర్పరచాడు. చందాదారులు కొద్దిపాటి సొమ్ము కట్టేవారు. ఈ సొమ్ముతో కొత్త గ్రంథాలు లైబ్రరీకి చేర్పబడేవి. చందాదారులు ఉచితంగా గ్రందాలను తీసుకో గలిగేవారు. అమెరికాలో పన్నులు వసూలుచేసి వాటి సహాయంతో మొట్టమొదటి ఉచిత గ్రంథాలయం (ఫ్రీ లైబ్రరీ) 1833 లో న్యూహాంప్‌షైర్‌లోని పీటర్‌బరోలో ఏర్పాటు కాబడింది.

ప్రపంచంలో యునైటెడ్ స్టేట్స్‌లో వాషింగ్‌టన్ DC 'కాపిటల్ హిల్' మీది లైబ్రరీ ఆఫ్

**జ్ఞాపకశక్తికి కిటుకు**

శ్రద్ధ జ్ఞాపకశక్తికి కిటుకు. అభిలాషవల్ల శ్రద్ధ ఏర్పడుతుంది. సాధారణంగా మనస్సులో బాగా నాటిన దానిని ఎన్నటికీ మరచిపోలేము.

— ట్రైరాన్ ఎడ్వర్డ్స్

"చేతపట్లు వాతపట్లు వేయకుండా చెప్పింది చేయగలవాడు యోగి."

కాంగ్రెస్ (ఏప్రిల్ 24, 1800 స్థాపితం) మిక్కిలి బ్రహ్మాండమైనది. ఇందులో 22 మిలియను వాల్యూములు, ఇంకా అనేక కరపత్రాలు, జర్నల్సు, మాపులు, ఫొటోగ్రాఫులు, మోషన్ పిక్చర్స్, మైక్రో ఫిల్ములు, వగైరా మొత్తం 86




మిలియను ఉన్నాయి. లైబ్రరీ భవనం మొత్తం 26.14 హెక్టేరుల వైశాల్యంలో 856 కి.మీ. పొడవుగా బీరువాలకు, షెల్ఫులకు స్థలం ఉంది.

బ్రిటన్‌లో మిక్కిలి పెద్ద లైబ్రరీ బ్రిటిష్ లైబ్రరీ. లండన్ యార్క్‌షైర్ బోస్టన్ స్పాలో 24.3 హెక్టేరుల వైశాల్యంలో 20 భవనాలలో ఏర్పాటైన ఈ లైబ్రరీలో 2500 మంది పని చేస్తారు. లైబ్రరీలో మొత్తం 16 మిలియను వాల్యూములు ఉన్నాయి. పుస్తకాలు పెరుగుతూంటే ప్రతీసంవత్సరం లైబ్రరీలో 12.8 కి.మీ. క్రొత్త షెల్ఫులు ఏర్పాటు చేస్తూంటారు. యూరప్‌లో మిక్కిలి పెద్ద పబ్లిక్ రిఫరెన్స్ లైబ్రరీ బ్రిటన్ స్కాట్లండ్‌లోని గ్లాస్కోలో నార్త్ స్ట్రీట్‌లో ఉన్న మిచెల్ లైబ్రరీ. దీంట్లో మొత్తం 40,00,000 వాల్యూమ్ములు ఉన్నాయి.

ప్రపంచంలో మిక్కిలి పెద్ద నాన్ స్టాచ్యుటరీ లైబ్రరీ 1895లో నిర్మింపబడిన న్యూయార్క్ పబ్లిక్ లైబ్రరీ. దానికి గల 82 బ్రాంచీలలో 12 మిలియను వాల్యూములు, 14 మిలియను లిఖిత ప్రతులు, 3.7 లక్షల మాపులు ఉన్నాయి. సోవియెట్ యూనియన్ మాస్కోలో లెనిన్ స్టేట్ లైబ్రరీలో 25 మిలియను పుస్తకాలు ఉన్నాయి.

ప్రాచీన భారతదేశంలో అనేక విద్యాకేంద్రాలు లేక విశ్వ విద్యాలయ నగరాలు ఉండేవి. వీటిలో నలంద, తక్షశిల, కాశీ, కంచీ ముఖ్యమైనవి. మతసంబంధమైన విషయాల పరిశోధనకు, పరిశీలనకు ఈ ప్రదేశాలలోగల లైబ్రరీలు సహకరించేవి. నలందాలో మిక్కిలి పెద్ద లైబ్రరీ 12 వ శతాబ్దం చివరి భాగంలో ఢిల్లీ నుంచి ముస్లిములు ఆక్రమించినప్పుడు పూర్తిగా తగులపెట్టబడింది.

ఈనాడు భారతదేశంలో మొత్తం 60,000 పైబడిన లైబ్రరీలు ఉన్నాయి. కలకత్తాలో పబ్లిక్ లైబ్రరీలో అపూర్వమైన పార్శీ, సంస్కృతం అరబ్బీ, తమిళ గ్రంథాలు అనేకం ఉన్నాయి. దీనికి 50 దేశాలలో 144 గ్రంథ సంస్థలతో వినిమయ సౌకర్యం ఉంది. బొంబాయిలో సెంట్రల్ లైబ్రరీ, ఢిల్లీలో ఢిల్లీ పబ్లిక్ లైబ్రరీ, మద్రాసులో కన్నెమరా పబ్లిక్ లైబ్రరీ ఇతర పబ్లిక్ లైబ్రరీలు. కన్నెమరా లైబ్రరీలో 5 లక్షల పుస్తకాలు, బైండ్ చేసిన పక్ష, వార పత్రికలు ఉన్నాయి. తమిళనాడులో ఇది మిక్కిలి పెద్ద పబ్లిక్ లైబ్రరీ. ఇచ్చట భద్రపరచబడిన పుస్తకాలలో 1608లో ప్రచురింపబడిన 'ది బైబిల్,' 1711లో భారతదేశంలో వ్యాపారం గురించి లాకేయర్ వ్రాసినగ్రంథాలు చాలా ముఖ్యమైనవి.

పరిశోధకులకు ఉపయోగపడే ప్రత్యేక లైబ్రరీలు న్యూఢిల్లీలో ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డ్ అఫైర్స్, అడయారులో థియసాఫికల్ సొసైటీ లైబ్రరీ, న్యూఢిల్లీలో సెంట్రల్ సెక్రటే

(మిగతా 32 వ పేజీలో)

# భారతీయ ప్రమాణాలు

ఎమ్. రఘుపతి

భారతదేశంలో ప్రమాణాల నిర్ణయం నేటిది కాదు. మిక్కిలి పురాతన మైనది. ఇండస్ లోయ నాగరికతకు చెందిన మొహెంజొదారో మరియు హరప్పా త్రవ్వకాలలో బయల్పడిన పురావస్తు అవశేషాలలో ఆనాడు ఒక విధమైన ఉత్పత్తుల ప్రమాణీకరణ



నియంత్రణ ఉన్నట్టు తెలుస్తూంది. సుమారు 100 A.D.లో రచింపబడిన మనుధర్మ శాస్త్రంలో తూకముల పట్టికలు, కొలతలు, ప్రమాణాలు నిర్ణయించ బడ్డాయి. ప్రతి ఆరేసి నెలలకు ఒకసారి పాలకుడైన రాజు వీటిని తనిఖీ చేస్తూండాలని, మోసగాళ్లను శిక్షించాలని వివరింపబడింది. చంద్రగుప్త మౌర్యుని మంత్రి కౌటిల్యుని అర్థశాస్త్రంలో తూకపు పట్టికలు, కొలమానాలు ప్రమాణీకరించ బడ్డాయి. తరువాత కొద్ది మార్పులతో ఇవే భారతదేశంలో అమలులోకి వచ్చాయి. 1175-1526 A.D.లో మహమ్మదీయులు ఉత్తర భారతదేశాన్ని జయించినప్పుడు ఆకాలంలో ఉన్న ప్రమాణాలు కొన్ని తెలుస్తున్నాయి. అల్లాఉద్దీన్ ఖిల్జీ తూకాల కొలతల పునర్వ్యవస్థీకరణ, షేర్షా పోస్టల్ విధానం, అక్బరు చక్రవర్తి క్రమబద్ధం చేసిన పన్నుల విధానం మొదలైన విషయాలు భారతదేశంలో తూకాలు, కొలతల ప్రమాణీకరణకు అంతగా తోడ్పడక పోయినా చరిత్రను చదువుకునే విద్యార్థులందరికీ తెలిసినవే.

కొనుగోలు వస్తువులలో విశిష్టతా నియంత్రణకు మొట్టమొదట 1909లో రైల్వే బోర్డువారు ప్రాతిపదిక వేశారు. కలకత్తా స్థానిక తయారీదారులపై తనిఖీకి ఒక ఇన్‌స్పెక్టరును నియమించారు. కలకత్తాలో 1913లో గవర్నమెంట్ టెస్ట్‌హౌస్ (ఇప్పుడు నేషనల్ టెస్ట్ హౌస్) ప్రారంభింపబడింది. ఇక్కడ లాబొరేటరీలో ఒక ఫిజిసిస్ట్, ఒక కెమిస్ట్‌ను నియమించారు. 1925లో లక్నోలో రైల్వేలకు సెంట్రల్ స్టాండర్డ్స్ ఆఫీసు ఏర్పాటు చేయబడింది. దీనినిబట్టి చూస్తే పారిశ్రామిక ప్రమాణీకరణ రైల్వేవారు మరియు డిఫెన్స్ డిపార్టుమెంట్ వంటి పెద్ద సంస్థలతో ప్రారంభమైందని చెప్పుకోవచ్చు.

## క్రొత్తగా ఏర్పడిన అగ్నిపర్వతం 90 అడుగులు లేచింది

అట్లాంటిక్ మహాసముద్రంలో ఏకాంతంగా ఉన్న ట్రిస్టాన్ డా కున్హా అనే ద్వీపంలో బయలుదేరిన క్రొత్త అగ్నిపర్వతము అక్టోబర్ 1961లో కొన్నిగంటల కాలంలో 90 అడుగులు ఎత్తు లేచింది.

"ప్రాప్తించిన దానితోనే తృప్తిపడేవాడు సుఖభోగి."

భారతీయ ప్రభుత్వ శిఫారసును అనుసరించి ఆగస్టు 6, 1919 నుండి ది ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజనీర్స్ (ఇండియా) వారు బ్రిటిష్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూట్ వారి ఇండియన్ కమిటీగా నియమింపబడ్డారు. ఆ కాలంలో భారతదేశంలో ముఖ్యంగా బ్రిటిష్ మరియు అమెరికన్ స్టాండర్డ్‌లు (ప్రమాణాలు) అమలులో ఉండేవి. భారతదేశంలో లభించే ముడి పదార్థాల వైవిధ్యం వల్ల మరియు ఇక్కడ ఉత్పత్తులకు, తయారీలకు అనుసరింపబడే విధానాలు వేరుగా ఉండడం చేత దేశంలో బ్రిటిష్ మరియు ఇతర ప్రమాణాలు అనుకూలవంతంగా ఉండవని తెలుసుకున్నారు. కాబట్టి భారతదేశంలో కొత్తగా ఇన్‌స్టిట్యూషన్ ఒకటి ఏర్పాటు చేయాలనే అభిప్రాయం 1940 డిసెంబరులో లక్నోలో ఏర్పాటైన 12వ పారిశ్రామిక సమావేశంలో ఏర్పడింది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఏర్పడిన సంక్లిష్ట ఆర్థిక పరిస్థితులలో వినియోగదారుల ప్రయోజనాలను సంరక్షించడానికి ఒక నూతన ప్రణాళిక ఏర్పరచవలసిన అవసరం ఏర్పడింది. సక్రమ పారిశ్రామిక, వ్యాపార మరియు వ్యవసాయాభివృద్ధులకు తగినట్టుగా ఈ ప్రణాళిక ఉండాలని నిశ్చయించ బడింది. ఈ విధంగా భారతదేశ స్వాతంత్ర్యం సిద్ధించిన సంవత్సరం జనవరి 1947లో దేశంలో గల పారిశ్రామిక, వైజ్ఞానిక, సాంకేతిక సంస్థల సహకార సానుభూతులతో నేషనల్ స్టాండర్డ్స్ బాడీగా ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ (ISI) స్థాపింపబడింది.

నేషనల్ స్టాండర్డ్స్ (జాతీయ ప్రమాణాలు)ను తయారుచేయడం, వాటిని ఉపయోగించేటట్లు చూడడం, కొలతలు ప్రమాణాలను గురించిన నిర్ణయాలను ప్రభుత్వంవారికి తెలియజేయుట, పరిశ్రమలలో విశిష్టతా నియంత్రణ ప్రమాణీకరణ, ISI గుర్తువేయడం, నిర్ణయాలు, ప్రమాణాలు గురించి స్టాటిస్టిక్స్ తయారీ మొదలైన కార్యక్రమాలన్నీ ISI సంస్థవారు నిర్వహిస్తారు ప్రజా సంక్షేమాభివృద్ధికోసం ఈ కార్యక్రమాలు మిక్కిలి ప్రయోజనాత్మకంగానూ, సామర్థ్యవంతంగాను కొనసాగించడానికి చట్టబద్ధం చేయవలసి వచ్చింది.

దీనిని అనుసరించి 1986 బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ అక్ట్ ప్రకారం ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్‌కి అధికారం ఇవ్వబడింది. ది బ్యూరో ఆఫ్ ది ఇండియన్ స్టాండర్డ్స్ ఏప్రిల్ 1, 1987 నుండి అమలులోకి వచ్చింది.

## జనాభా పెరుగుదల రేటు తగ్గినా సమస్యే




*ఆసియాలో సింగపూరు ఒక్కటే జనాభా పెరుగుదల రేటు తగ్గడంవల్ల తీవ్రమైన సమస్యను ఎదుర్కుంటూంది. వచ్చే 5 సంవత్సరాలలో సంవత్సరానికి 56,000 మంది పిల్లలు జన్మించవచ్చు. ఈనాడు సింగపూరులోని 2.6 మిలియను జనాభాలో చైనీయులు 75 శాతం, మలయా దేశస్థులు 15 శాతం, భారతీయులు 6 మొదలు 7 శాతం ఉన్నారు.*

"ఆత్మను ఇచ్చి పరమాత్మను గ్రహించాలి."

భారతీయ ప్రమాణాలను నిర్ణయించడం, ప్రచురించడం, ఆచరణలో పెట్టడం వంటివన్నీ బ్యూరో వారు చేపడతారు. ISI సర్టిఫికేటు ఇవ్వడానికి వస్తువు విశిష్టతా నియంత్రణాభివృద్ధికి లాబొరేటరీల సంస్థాపన, పర్యవేక్షణ, వివిధ విషయాలను తెలియచేయడానికి గైడులు ప్రచురణ మొదలైన కార్య క్రమాలను ఈ బ్యూరో వారు అమలులో పెడతారు.

ఇండియన్ స్టాండర్డ్స్ జాతీయ ప్రమాణాలు. ఇవి అచ్చువేయబడిన డాక్యుమెంట్లు. దీంట్లో విశిష్టతా నియంత్రణలో వస్తూత్పత్తికి కావలసిన ప్రమాణాలు వివరింపబడి ఉంటాయి. ఇండియన్ స్టాండర్డ్స్‌ను బ్యూరోకి సంబంధించిన 2023 టెక్నికల్ కమిటీలు సిస్టమ్స్ అండ్ సర్వీసెస్, కెమికల్, సివిల్ ఇంజనీరింగ్, ఎలక్ట్రానిక్స్ అండ్ టెలికమ్యూనికేషన్స్, ఎలక్ట్రోటెక్నికల్, ఫుడ్ అండ్ అగ్రికల్చురల్, హెవీ మెకానికల్ ఇంజనీరింగ్, మెడికల్ ఎక్విప్‌మెంట్ మరియు హాస్పిటల్ ప్లానింగ్, మెటలర్జికల్ ఇంజనీరింగ్, పెట్రోలియం, బొగ్గు మరియు దానికి సంబంధించిన వస్తువులు, ప్రొడక్షన్ ఇంజనీరింగ్, రివర్ వాలీ ప్రాజెక్టులు, టెక్స్ టైల్స్ మరియు ట్రాన్స్‌పోర్టు, ఇంజనీరింగ్ మొదలగు వాటికి సంబంధించిన ప్రాతిపదిక ప్రమాణాలను పరీక్షిస్తూంటాయి.

పై కమిటీలలో 36,000 పైబడిన సభ్యులు ఉన్నారు. ప్రభుత్వరంగం నుంచి ప్రజారంగం నుంచి మరియు పారిశ్రామిక రంగం నుంచి ఈ కమిటీలలో మంచినిపుణులను నియమిస్తారు.

బ్యూరో సర్టిఫికేషన్ మార్కింగ్ ప్రణాళికా ప్రకారం ఉత్పత్తిదారులు తయారుచేసే వస్తువులు ఇండియను, ప్రమాణాల నిర్ణయానికి అనుగుణ్యంగా ఉన్నదీ, లేనిదీ పరీక్షించి ఆవస్తూత్పత్తుల మీద ISI గుర్తును వేయడానికి 1986 బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ చట్టం క్రింద అధికారం ఇవ్వబడింది.

ప్రతీ లైసెన్స్‌కి పరిశోధన పరీక్ష తప్పనిసరిగా జరగాలి. లైసెన్సీ దీనిని ఖచ్చితంగా అనుసరించాలి. లైసెన్స్ అమలులో ఉన్నప్పుడు BIS ఇన్‌స్పెక్టర్లు అకస్మాత్తుగా వచ్చి ఉత్పాదక

## ప్రతిదినం ఒక క్రొత్త అవకాశం

మనలో చాలామంది జీవితంలో సదవకాశం ఎప్పుడో ఎదురవుతుందని నిరీక్షిస్తూ కూర్చుంటాము. అటువంటి అవకాశం కాస్తా జారిపోతే తికమకలు



పడిపోతారు. సుప్రసిద్ధ ఆంగ్లేయ నాటకకారుడు షేక్స్పియర్ వంటివాడు 'జీవిత ప్రవాహంలో అవకాశం వినియోగించుకుంటే అదృష్టంవరిస్తుంది' అన్నాడు.

వాస్తవానికి ప్రతిదినం ఒకక్రొత్త అవకాశం ఎదురుగానే ఉంటుంది. అవకాశం అనేది ఉత్సాహం కలిగించి, ఆయత్తపరచి, ఉద్యమింపచేసి, విజయం పొందమంటూ నీవీపు తడుతూ ఉంటుంది. జారిపోయిన సదవకాశాలను విచారించటం కీలిస్తున్న దానిని గురించి చింతించటం. గతించిన రోజు గతించింది. ప్రతి సూర్యోదయంతో ఉద్భవిస్తుంది మరోక్రొత్త అవకాశం. సద్వినియోగం చేసుకో

"ఆత్మను కోల్పోయాక లోకమంతా జయించినా శాంతి సమకూరదు."

సంస్థలలో పరిశోధించి పరీక్ష ప్రణాళిక సక్రమంగా అనుసరింప బడుతున్నదీ, లేనిదీ తెలుసుకుంటారు. ఉత్పాదక రంగం నుంచీ, మార్కెట్ల నుంచీ శాంపిల్స్‌ను సంగ్రహించి ప్రత్యేకమైన లాబొరేటరీలలో వాటిని పరీక్షిస్తారు. వినియోగదారులు కొనుక్కున్న వస్తువులు విశిష్టతా ప్రమాణాలకు సమంగా లేనప్పుడు ISI మార్క్‌గల వస్తువులను పిరాయించే సదవకాశం వినియోగదారులకు ఉంది. కేబిల్స్, బిస్కెట్లు, సిరాలు, పంపులు, మోటార్లు వగైరా కూడా బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ వాలంటరీ ప్రణాళికలో చేర్చబడ్డాయి.

భారతీయ ప్రభుత్వం వారు కొన్ని వస్తువులకు సర్టిఫికేషన్ ప్రణాళిక చట్టబద్ధంచేసి సుమారు 121 వస్తువులు తప్పకుండా సర్టిఫికేట్ పొందాలని నిర్ణయించారు. ఎల్‌పిజి సిలిండర్లు, వాల్వులు, మిఠాయిరంగులు, వనస్పతి, 18 లీటర్ల చదరపు డబ్బాలు, బాటరీలు, ఎలక్ట్రిక్ ఇమ్మర్షన్ వాటర్ హీటర్లు, ఇళ్లలో వాడుకునే 2 ఆంప్స్ స్విచ్‌లు, 3 పిన్‌ప్లగ్‌లు సాకెట్ ఔట్‌లెట్లు, ఎలక్ట్రిక్ స్టౌలు వగైరా అన్నీ చట్టబద్ధంగా పరీక్షా ప్రణాళికలో చేర్చబడ్డాయి. ప్రత్యేక వస్తూత్పత్తుల పరీక్షకు అనువైన సాధనాలను కొనడానికి బ్యూరో సలహా సహాయక సేవాసౌకర్యం కలిగి ఉంటుంది. ముఖ్య కార్య నిర్వాహక విషయాలలో ఇంటర్నేషనల్ ఆర్గనైజేషన్ ఫర్ స్టాండర్డైజేషన్ (IOS) సభ్యులు, ఇంటర్నేషనల్ ఎలక్ట్రోటెక్నికల్ కమిషన్ (IEC) సభ్యులు కూడా సహకరిస్తారు.

ముఖ్యంగా వినియోగరంగంలో సహకరించడానికి స్టాండర్డైజేషన్‌కి బ్యూరో తగిన చర్యలు తీసుకుంటుంది. దీని హెడ్ ఆఫీసు న్యూఢిల్లీలో ఉంది. భారతదేశం అంతటా దీని శాఖలు ఉన్నాయి.

●

## రక్తంలో కొలెస్టరాల్‌ను కారట్ తగ్గిస్తుంది

రక్తంలో కొలెస్టరాల్ ప్రమాణాన్ని తగ్గించుకోవాలంటే కారెట్ దుంపలు, కాబేజీ, ఉల్లిపాయలు ఎక్కువగా వాడండి. వీటన్నిటిలోనూ కూడా




రక్తంలో కొలెస్టరాల్‌ను తగ్గించే కాల్షియం పెక్టేట్ ఉంటుంది. రోజుకి రెండు మధ్యరకం పరిమాణం గల కారెట్ దుంపలు మూడువారాలపాటు తింటే ఆరోగ్యవంతుల రక్తంలో కొలెస్టరాల్ విలువ సగటున 11 శాతం తగ్గినట్టు ఇదివరలో తెలుసుకోబడింది. సాధారణంగా పీచు పదార్థాలలో ఉండే కాల్షియం పెక్టేటు రక్తంలో కొలెస్టరాల్‌ను తగ్గిస్తుందని కూడా తెలుసుకోబడింది. ఇది బైల్ ఆసిడ్‌లతో చేరుతుంది. లివరులో బైల్ ఆసిడ్‌లు తయారవడానికి కొలెస్టరాల్ అవసరం కాబట్టి కొంతవరకే రక్తంలో చేరుతుంది. దీని ఫలితంగా రక్తంలో కొలెస్టరాల్ ప్రమాణం తగ్గుతుంది.

ఉల్లిపాయ, కాబేజీలమీద చేసిన పరిశోధనల వలన కూడా ఇవే ఉత్తమ ఫలితాలు లభించాయి. ఆపిల్ పండు మరియు ద్రాక్షపండ్లలో ఉండే పీచుకూడా కారెట్ల అంతఎక్కువగా కాకపోయినా కొలెస్టరాల్‌ను కొంతవరకు తగ్గిస్తాయని తెలుసుకున్నారు. ఓట్లు మరియు చిక్కుడు జాతిగింజలలో ఉండేపీచు కొలెస్టరాల్‌ను బాగా తగ్గిస్తుంది. కారెట్‌లో పీచుకూడా చాలా ఉత్తమ రకం పీచు. దీనిలో కాలరీ విలువ ఉండదు.

—హెల్త్ సావనీర్

"శాస్త్రజ్ఞులకు సాధ్యాసాధ్యాలు తెల్సు.
నేను అసాధ్యం అనుకున్నది తెల్సు సాధ్యం చేయగలను."

# అవీ - ఇవీ

## స్మితాపాటిల్ ఏడు భాషలలో నటించింది

సుప్రసిద్ధ భారతీయ సినీమానటి స్మితా పాటిల్ మరాఠీ, హిందీ, గుజరాతీ, తెలుగు,


SMITA PATIL

మలయాళం, బెంగాలీ, కన్నడం - ఏడు భాషలలో నటించింది.

* * *

## ఆస్ట్రేలియాలో మూటికి రెండు వంతులు చెట్లు కొట్టేసారు

ఆస్ట్రేలియాలో మూటికి రెండువంతుల వృక్షావరణాన్ని పూర్తిగా కొట్టేసారు. దీనివల్ల యూరోపియన్ వలసలు ఏర్పడిన 200 సంవత్సరాలలో 96 జాతుల మొక్కలు, జంతువులు అంతరించి పోయాయి. వ్యవసాయానికి ఉపయోగపడే భూమి 51 శాతం నశించి పోవడం వల్ల దీనిని తిరిగి సారవంతం చేయవలసిన అవసరం ఏర్పడింది. భూమి మీద నివసించే ఆస్ట్రేలియాలోని వెన్నెముకగల జంతుజాతులు 18 అంతరించి పోయాయి ఇంకా 28 జాతులు అంతరించిపోయే పరిస్థితులలో ఉన్నాయి. స్థానికంగా పెరిగే 78 జాతి మొక్కలు అంతరించి పోయినట్టు ఊహించబడుతూంది. 200 జాతులు అంతరించిపోయే పరిస్థితులలో ఉన్నాయి. అనేక నదీ ప్రవాహాలు, పల్లపు భూములు, భూగర్భ జలాలు బాగా తగ్గిపోయాయి.

— సిఇఇ.ఎస్ఎఫ్ఎస్ సౌజన్యంతో

* * *

( 27 వ పేజీ తరువాయి)

రియట్ లైబ్రరీ, కలకత్తాలో ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్ చెప్పుకోదగినవి.

15,000 లిఖిత గ్రంథాలతో ఉత్తర ప్రదేశ్‌లో రాంపూర్ రాజాలైబ్రరీ, భారతీయ మరియు యూరోపియన్ భాషలలో వివిధ విషయాలతో 23,000 గ్రంథాలు ఉన్న తమిళనాడు తంజావూరులో 'సర్ఫోజీ మహారాజు' స్థాపించిన సరస్వతి మహల్ లైబ్రరీలు కూడా ముఖ్యమైన లైబ్రరీలు. 15,000 లిఖితగ్రంథాలు, 2,000 చిత్రాలు గల బీహారు పాట్నాలోని ఖుదాబక్ష్ ఓరియెంటల్ పబ్లిక్ లైబ్రరీ, ఉత్తరప్రదేశ్ వారణాశిలోని సంస్కృత యూనివర్శిటీ లైబ్రరీలు చాలా ముఖ్యమైనవి.

ప్రపంచంలో మొట్టమొదటి లైబ్రేరియన్ చైనా తాత్త్విక శాస్త్రజ్ఞుడు లావోట్సే (Lao Tse). 550 బిసిలో చైనా ప్రభువులు రాయల్ హిస్టారికల్ రికార్డుల రక్షణకై ఇతడిని నియమించారు.

"ఒకటిస్తే పదిరెట్లు ఇవ్వాలి. నీకు వందనం చేసేవాడికి నీవు సాష్టాంగ వందనమొనర్చు."

## ప్రపంచంలో 500,000,000 మంది బౌద్ధులు



ఈనాడు ప్రపంచంలో మొత్తం 500,000,000 బౌద్ధులు ఉన్నారు. వీరంతా వివిధ భాషలలో గౌతమ బుద్ధుని ఉపదేశాలను అనుసరిస్తారు. శ్రీలంకా, మయాన్మార్ (బర్మా) థాయ్‌లాండ్, కొరియా, జపాన్, భూటాన్ మరియు చైనాలో బౌద్ధులు చాలామంది నివసిస్తారు.

* * *

## 'పృథ్వీ' భూతలంమీద ఉపయోగపడే అస్త్రం

భారతదేశంలో డిఫెన్స్ రీసెర్చి అండ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్‌వారు అభివృద్ధి చేసిన 'పృథ్వీ' ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశం మీదికి భూతలం మీద ఉపయోగపడే అస్త్రం. దీనికి 250 కి.మీ.ల రేంజి ఉంది. యుఎస్ఎస్ఆర్, యుఎస్ఎ, చైనా, ఫ్రాన్స్ నాలుగు దేశాలు కూడా ఇటువంటి అస్త్రాలను అభివృద్ధి చేశాయి.

* * *

## 40 దేశాలలో ISBN విధానం ఉపయోగింపబడుతూంది

ది ఇంటర్నేషనల్ స్టాండర్డ్ బుక్ నెంబర్ (ISBN) విధానాన్ని ఇంటర్నేషనల్ స్టాండర్డ్స్ ఆర్గనైజేషన్ వారు 1969లో అనుమతించారు. ఇప్పుడు 40 దేశాలలో ఉపయోగపడుతూన్న ఈ విధానం బ్రిటన్‌లో కల్పించబడింది. దీనివల్ల బుక్ ఆర్డరింగ్ మరియు కేటలాగింగ్ సౌలభ్యమైంది.

* * *

## మొట్ట మొదటి ట్రాన్సోనిక్ విండ్ టనెల్ స్వదేశీ నిర్మాణం

భారతదేశంలో పూర్తిగా మొట్టమొదటి ట్రాన్సోనిక్ విండ్ టనెల్ రూ. 2 కోట్ల వ్యయంతో బెంగళూరులో నిర్మించబడింది. వాయు విమానాల ఎయిరో డైనమిక్ మరియు ఎయిరోలాస్టిక్‌ల మరియు స్పేస్ లాంచర్ మిస్సైల్‌ల పరీక్షలకు ఇది ఉపయోగ పడుతుంది. ఈ విండ్ టనెల్‌కి 1 2 మాచ్ (Mach) నెంబర్ వరకు వేగాలను పరీక్షించే శక్తి ఉంది.

* * *

## ప్రపంచంలో గజ ఈతగాళ్లు

ప్రపంచంలో ఉత్తర అమెరికా అలాస్కాలో సీల్స్ చాలా దూరం బాగా ఈదగలవు. ఆర్కిటిక్ శీతాకాలంలో ఇవి దక్షిణం వైపు ఈదుతూపోతాయి. ఇవి ఎనిమిది నెలల పాటు సముద్రాలలో నివసిస్తాయి. ఇవి ఒక్కొక్కప్పుడు భూమిని తాకకుండా6,000 మైళ్లు ఈదుతాయి. వసంత కాలంలో తిరిగి అలాస్కాకి చేరుకుంటాయి

"చేసిన మేలు మరువనివారు చిరంజీవులు."

# తిరువనంతపురం

వి.ఎస్. శ్రీనివాసన్

కేరళ రాష్ట్రం రాజధానియైన తిరువనంతపురం ఒక అందమైన నగరం. నగరం ఏటవాలుగా ఉన్న ఒక చిన్న కొండపై ఉండడంచేత వర్షా కాలంలో వర్షాలకు చెత్తాచెదారం కొట్టుకుపోయి పట్టణం పరిశుభ్రంగా ఉంటుంది.

తిరువనంతరం (తిరు - అనంతపురం) అంటే పవిత్రమైన అనంత సర్పముపై పవళించి ఉండే విష్ణువు నివాసస్థలం. దీనినే త్రివేండ్రం అని సాధారణంగా పిలుస్తూంటారు. శ్రీపద్మనాభస్వామి దివ్యక్షేత్రమిది. పూర్వం అనంతశయనం అని చెప్పబడే ఈ దివ్యక్షేత్రం హిందువులకు పుణ్యక్షేత్రంగా అలరారుతూంది. 1750 లో రాజామార్తాండవర్మ తన



రాజధానిని పద్మనాభపురం నుంచి తిరువనంతపురానికి మార్చినప్పటినుంచీ ఇది ట్రావెన్కూర్ సంస్థానానికి రాజధానిగా ఉంటూంది. అనేక యుద్ధాలు చేసినందువల్ల పొందిన పాప నివృత్తికై రాజు కేరళ రాజ్యాన్ని పూర్తిగా పద్మనాభస్వామికి అంకితం చేసాడు.

నగరంలో శ్రీపద్మనాభస్వామి దేవాలయం చారిత్రకంగా అతిముఖ్యమైన ప్రదేశం. ఈ దేవాలయం ఎప్పుడు నిర్మించినది ఆధారాలు కన్పించలేదు. కానీ నేడు మనం చూస్తున్న పద్మనాభ స్వామి దేవాలయం రాజా మార్తాండ వర్మ పాలనాకాలంలో బ్రహ్మాండంగా ప్రవృద్ధి పొందినట్లు లిఖిత ప్రమాణాలు కనిపిస్తున్నాయి. ఈవిష్ణు ఆలయం దక్షిణ భారత శిల్పానికి ప్రతీక. ఏడు అంతస్థుల పెద్ద గోపురం ఎదురుగా ఉన్న పుష్కరిణి అత్యంత రమణీయంగా ఉంటుంది. దేవాలయంలో విశాలమైన మంటపం చుట్టూ దివ్య విగ్రహాలు చెక్కబడిన


KAUDIYAR PALACE

300 స్తంభాలు అతివైభవంగా ఉంటాయి. గోడలపై చిత్రాలు అలంకరింపబడి ఉంటాయి. దేవాలయంచుట్టూ కోటలో అనేక ప్రాచీన రాజభవనాలు ఉన్నాయి.

త్రివేండ్రంలో నేడు కౌడియార్ రాజభవనం, కనకకున్ను రాజభవనం, అబ్జర్వేటరీ, సెక్రటేరియెట్ భవనం, లెజిస్లేటివ్ చేంబర్స్, విక్టోరియా జూబిలీహాల్, యూనివర్సిటీ భవనాలు మరియు కాలేజీలు ముఖ్యమైన పెద్దపెద్ద కట్టడాలు.

మ్యూజియం చుట్టూగల సుందరమైన తోటలో గల జంతుప్రదర్శన శాల భారత దేశంలో అత్యుత్తమమైనది. ఇక్కడే ఆర్ట్‌గాలరీ

కూడా ఉంది. ఇచ్చట సుప్రసిద్ధమైన చిత్ర కారుడు రాజా రవివర్మ మొదలు అనేక భారతదేశపు మరియు తూర్పు ఆసియా దేశపు చిత్రకారుల అపూర్వ చిత్రాలు అనేకం ఉన్నాయి.

పబ్లిక్ గార్డెన్స్‌లో రాయి మరియు ఇటుకలతో నిర్మించిన మ్యూజియం శిల్ప సౌందర్యం అమోఘమైనది. ఈ మ్యూజియంలో అంద మైన కంచు,రాతివిగ్రహాలు, వివిధ ఆభరణాలు, రకరకాల సంగీత వాద్యాలు, దంతపు బొమ్మలు ప్రదర్శింపబడతాయి. 300 సంవత్సరాల




నాటి పురాతనమైన రథం, వివిధ కాలాలకు, రాజ్యాలకు చెందిన సంగీతవాద్యాలు, నాయర్ అవిభక్త సమిష్టి కుటుంబానికి చెందిన తరవద్ (ఇల్లు) మొదలైనవి కూడా మ్యూజి యంలో ఉన్నాయి.

త్రివేంద్రంలో బీచ్‌దగ్గరగా ఉన్న అక్వేరియం, అబ్జర్వేటరీ ప్రాచీన లిఖిత పుస్తక భాండారము కూడా సందర్శించ వలసిన ముఖ్యప్రదేశాలు. అనేక ప్రాచీన తాటాకు పుస్తకాలు ప్రాచీన లిఖిత పుస్తక భాండారంలో భద్రపరచ బడి ఉన్నాయి.

త్రివేంద్రంలో సెక్రటేరియేట్ భవనం 118 సంవత్సరాల పురాతనమైన కట్టడం: ఇది పెద్ద పెద్ద స్తంభాలపైన తెల్ల రంగుతో గ్రీకు స్టైలులో నిర్మించబడింది. యూనివర్సిటీ కాలేజీ, టౌన్‌హాల్, పబ్లిక్‌లైబ్రరీ భవనాలు కూడా చాలాప్రాచీనమైనవి. ఇవిప్రాచీన ఆంగ్లేయ శైలిలో నిర్మించబడ్డాయి.

త్రివేంద్రం దగ్గర వేలీ సరస్సు ప్రసిద్ధ మైన కేరళబాక్‌వాటర్స్‌ను స్ఫురింపజేస్తుంది. త్రివేంద్రంకు 16 కి.మీ. దూరంలో ఉన్న కరమన నది మీద అరువికార వాటర్‌వర్క్స్



ప్రకృతి రమణీయమైన దృశ్యాలతో విలాస యాత్రలకు పిక్‌నిక్‌లకు చాలాప్రసిద్ధి పొందింది. పశ్చిమకనుములక్రింద కొండ ప్రదేశాలలో విశాలమైన నెయ్యార్ డామ్ చెరు వులలో పడవ ప్రయాణాలు విలాసవంతంగా ఎంతో ఆహ్లాదకరంగా కూడా ఉంటాయి.

త్రివేంద్రంకు 61కి.మీ.ల తూర్పుగా సముద్ర మట్టానికి 912 మీటర్ల ఎత్తున ఉన్న పొన్ముడి హిల్‌స్టేషన్ కొండ విడిదిగా ప్రసిద్ధి చెందింది. ●

## ప్రపంచంలో మిక్కిలి అపురూపమైన మొక్క

ప్రపంచంలో సిల్వర్‌సోర్డ్ వంటి మొక్క చాలా అపురూపమైనది. ఇది పసిఫిక్ మహాసముద్రంలో హవాయ్ ద్వీపం మీద అంతరించిపోయిన అగ్ని పర్వతపు వల్లప్రాంతంలో పెరుగుతుంది.

"కర్మకాండను పరిత్యజించి జ్ఞానకాండను అనుష్ఠించేవారు జ్ఞానులు"

# వీరిని గురించి తెలుసుకోండి

రీటా హేవర్త్: 'ది లవ్ గాడెస్ ఆఫ్ ది ఫార్టీస్'గా ప్రసిద్ధిపొందిన హాలీవుడ్ సినీమా నటి. 'ది లవ్స్ ఆఫ్ కార్మెన్', 'ది స్ట్రాబెర్రీ



బ్లాండీ', 'ది లేడీ ఫ్రమ్ షాంగై' ఈమె నటించిన సుప్రసిద్ధ సినీమాలు.

* * *

డా. చార్లెస్ గ్లెన్‌కింగ్: సుప్రసిద్ధ పోషకాహార శాస్త్రజ్ఞుడు (Nutritionist). ఇతడు యుఎస్ఎ పిట్స్‌బర్గ్ యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా ఉంటూ 1932 లో నిమ్మరసం నుంచి విటమిను Cని వేరుచేసాడు. క్రొత్తగా కనిపెట్టిన దానిపై పరిశోధనలు వల్ల విటమిను C స్కర్వీ, తలలో చుండ్రు, పోషకాహార లోపాన్ని నివారిస్తుందని తెలుసుకోబడింది.

* * *

మౌరీన్ కన్నొల్లీ: అమెరికా దేశపు సుప్రసిద్ధ టెన్నిస్ ఆటగత్తె. 1953లో 'గ్రాండ్‌స్లామ్' (grandslam) ను సాధించిన మొట్టమొదటి మహిళ. ఈమె 1951 నుంచి 1954 వరకు దిగ్విజయంగా రాణించింది.

* * *

ఎస్. గోపాలస్వామి అయ్యంగార్: భారత రాజ్యాంగ విధానాన్ని రూపొందించిన వారిలో ప్రముఖుడు. స్వాతంత్ర్య భారతదేశంలో ట్రాన్స్‌పోర్టు మరియు రైల్వేల మంత్రిగా ఉంటూ రెండవ ప్రపంచ యుద్ధ ఫలితంగా దేశంలో అస్తవ్యస్తమైన రైల్వే విధానాన్ని యుద్ధానికి పూర్వమున్న యథాస్థితికి తీసుకువచ్చాడు. కాశ్మీరు తగాదాలను గూర్చి సునిశిత పరిచయంతో, యునైటెడ్ నేషన్స్‌లో భారతదేశం తరపున అతి సమర్థంగా వాదించాడు.

* * *

అజీ ముల్లాఖాన్: అతి సామాన్యమైన స్థితి నుంచి నానాసాహెబ్ పీష్వాబహదూర్ ఏజెంట్‌గా ప్రసిద్ధిపొందిన మహనీయుడు. ఉత్తర ప్రదేశ్ కాన్పూర్‌లో ఇతడు 1857లో (మొదటి స్వాతంత్ర్య యుద్ధం) తిరుగుబాటులో ముఖ్యపాత్రను వహించాడు. తిరుగుబాటు విఫలమైన తరువాత తన ప్రభువు నానా సాహెబ్‌తో నేపాలు వెళ్లాడు. అక్కడ రోగంతో మరణించాడు.

* * *

మిగతా 42 వ పేజీలో

## జపాన్‌లో 150 కామిక్ మాగజైనులు

జపాన్‌లో 150కి పైగా వివిధ కామిక్ మాగజైనులు ప్రచురింపబడుతున్నాయి. వీటిలో కొన్నిటికి బ్రహ్మాండమైన సర్క్యులేషన్ ఉంది. యువకులకు 'జానెన్ జంప్' అనే 300 పుటల వారపత్రిక వారానికి నాలుగుమిలియను కాపీలకు పైగా అమ్ముడవుతుంది.

"నీవు చెప్పేదానిని సందేహించవచ్చు, కాని చేసేదానిని విశ్వసిస్తారు."

# చిట్టి దేవతలకు చిన్న కథలు

## బంగారం ఎవరిది?

### ఇసయా మార్టిన్

పూర్వం అర్మేనియాలో ఇద్దరు వ్యవసాయ దారులు ఉండేవారు వారిలో ఒకడికి ఒక కాడి ఎద్దులు మాత్రమే ఉన్నాయి. దున్నుకోడానికి పుట్టెడు నేలైనా లేదు. రెండోవాడికి భూమి మాత్రమే ఉంది ఎద్దులు లేవు ఈ ఇద్దరూ ఒకరిని విడిచి ఒకరు ఉండలేని ప్రాణస్నేహితులు కాబట్టి ఇద్దరూ కూడబలుక్కుని మొదటి వాని ఎద్దుల సహాయంతో భూమిని దున్నుకుని గింజలు జల్లి పొలం పండించుకుని వచ్చిన ఫలసాయాన్ని ఇద్దరూ సమంగా పంచుకోడానికి అంగీకరించుకున్నారు

ఒక రోజు ఒకడు పొలం 'దున్నుతూండగా నాగలి భూమిలో చిక్కుకు పోయింది వెంటనే నాగలికి కట్టిన ఎద్దులను విప్పి పారతో మట్టిని త్రవ్వి నాగలిని పైకి తీయడానికి ప్రయత్నిస్తూంటే ఒక చిన్న ఇనుపపెట్టె దొరికింది. దాని నిండా బంగారం ఉంది. పట్టరాని సంతోషంతో ఆపెట్టెను తిరిగి మట్టిలో కప్పిపెట్టి తన స్నేహితుడి దగ్గరకు వెళ్లి విషయం చెప్పి వెంటనే వచ్చి ఆ పెట్టెను తీసుకోమన్నాడు.

దానికారైతు 'నేను తీసుకోను. నీకు ఆ పెట్టె దొరికింది కాబట్టి అది నీదే' అన్నాడు. 'కాదు కాదు అది నీ పొలంలో దొరికింది కాబట్టి దానికి పూర్తి హక్కుదారుడవు నీవే' అన్నాడు రెండో రైతు.

ఈ విధంగా కొన్ని రోజులు గడిచి పోయింది. బంగారం ఉన్న పెట్టె ఇద్దరిలో ఎవ్వరూ తీసుకోడానికి సమ్మతించలేదు 'నాకు వద్దంటే నాకు వద్దు' అంటున్నారు. ఇంతలో ఈ వార్త రాజు దగ్గరకు వెళ్లింది 'నేను

## ఐవరీకోస్టులో అడవుల పరిస్థితులు



పశ్చిమ ఆఫ్రికా ఐవరీ కోస్టు ప్రదేశంలో 15 మిలియను హెక్టేరుల సహజమైన అడవులలో ఒక మిలియను హెక్టేరుల అడవులు మాత్రమే 1965 వరకు మానవుని స్పర్శలేక మిగిలినవని ప్రపంచ బ్యాంక్ ఎఫ్ ఎ ఒ (FAO) వారి రిపోర్టు తెలియజేస్తోంది. ఇప్పుడు ప్రతీ సంవత్సరం 3,00,000 హెక్టేరుల అడవులు కొట్టివేయబడుతున్నాయి. అయితే కేవలం 5,000 హెక్టేరులలో మాత్రమే చెట్లు తిరిగి నాటబడుతున్నాయి. ఎంత శీఘ్రంగా పెరిగే చెట్టైనా బాగా పెరగడానికి 15 సంవత్సరాల కాలం పడుతుంది. కలప వ్యాపారంగా ఎగుమతి చేయడంవల్ల అడవి సంపద పూర్తిగా నాశనమైపోతుంది.

— సేకరణ: ఎస్.ఎస్.ఎస్. రాజ్యలక్ష్మి

"భక్తిశ్రద్ధలు ఉండాలేగాని, భగవత్ప్రాప్తి అందరికీ లభిస్తుంది."

రాజుని. ఆబంగారం నాకు చెందాలి. ఎవ్వరిదీ కాదు' అంటూ బంగారం చూడడానికి పొలానికి వచ్చాడు. రైతు పెట్టెమూత తీసాడో లేదో దాని నిండా పాములు బుసలు కొడుతూ పైకి వచ్చాయి. భయపడి రాజు తనని మోసం చేయడానికి ఇలా చేసారని రైతులను దూషించాడు.

రాజు తిరిగి వెళ్లి, ఇద్దరు మంత్రులను పంపి ఆ రైతులను పట్టి చెరసాలలో పెట్ట మన్నాడు. వచ్చిన మంత్రులకు రైతులు పెట్టె మూత తీసి చూపించారు. ఆ పెట్టెనిండా ధగధగలాడుతూ మెరిసిపోతూన్న బంగారం ఉంది. పాములు కనిపించలేదు. మంత్రులు వెంటనే రాజుగారి దగ్గరకు వెళ్లి ఆ పెట్టెలో పాములు కాదు బంగారమే ఉందని చెప్పారు. రాజుకు ఏమీ అర్థంకాలేదు పెట్టెలో అందరికీ బంగారం కనిపిస్తూఉంటే తనకు మాత్రం ఎందుకు పాములు కనిపిస్తున్నాయి అని విభ్రాంతిపొందాడు

వెంటనే రాజుగారు ఊళ్లో పండితులనంద రినీ పిలిపించారు. జరిగిన సంగతి చెప్పి తనని కలవర పెడుతూన్న సమస్యకు పరిష్కారం చెప్పమన్నాడు. రైతులను రప్పించాడు పండితులు చెప్పే తీర్మానాన్ని చెప్పమన్నాడు. పండితులు 'మహారాజా! న్యాయం ప్రకారం ఇందులో బంగారం రైతులకు చెందాలన్న విషయం భగవంతుడికి తెలుసు. అందుకే మీకు ఇందులో బంగారం బదులు పాములు కనిపించాయి ఇతరులకు, రైతులకు కూడా అందులో బంగారమే కనిపిస్తూంది' అన్నారు. దానికి రాజు 'నిజమే, కానీ రైతులు ఇద్దరూ ఎవరికివారు తమకా బంగారం వద్దంటున్నారు. అది ఎవరికి చెందాలి' అని అడిగాడు. వెంటనే ఆపండితుడు రైతులను పిలిచి 'మీకు పిల్లలు ఉన్నారా?' అని అడిగాడు. దానికి ఒకరైతు తనకు ఒక కొడుకు, ఇంకోరైతు తనకు ఒక కూతురు ఉన్నారన్నారు. 'మహారాజా! ఈ పిల్లలు ఇద్దరికి వివాహం చేసి ఆ పెట్టెలో ఉన్న బంగారం పెళ్లిలో వధూవరులను ఆశీర్వ దించి కానుకగా ఇవ్వండి అన్నారు పండితులు

పండితులు చెప్పినదానికి రాజు మిక్కిలి సంతోషించి, రాజగృహంలో పెళ్లికి ఏర్పాటు చేయించాడు. బంగారం ఉన్న పెట్టెను వధూ వరులను ఆశీర్వదించి బహుమానంగా ఇచ్చాడు. ●

## ప్రతీరోజూ 40,000 మంది పిల్లలు మరణిస్తున్నారు



సక్రమ పోషకాహారలోపంవల్ల మరియు ఇతర రోగాలవల్ల 40,000 మంది ప్రతీరోజూ మరణిస్తున్నారని ప్రపంచ నిపుణులు తెలియజేస్తున్నారు. టీకాల మందుకు ఆస్కారం లేక సాలీనా 3.5 మిలియను మంది పిల్లలు మరణిస్తున్నారు లేక వికలాంగులై పోతున్నారు. పసిపిల్లలలో అత్యధికమైన మారకరోగాలవల్ల అభివృద్ధి పొందుతూన్న ఆఫ్రికా దేశాలలో జీవిత ప్రమాణం చాలాతగ్గిపోతుంది. ఇది యూరపులో కంటే 20 సంవత్సరాలు తక్కువ.

"కాంక్షలో తీవ్రతనుబట్టి ప్రయత్నంలో తీవ్రత పెరుగుతుంది."

# గోమతేశ్వర

ఎన్. రామకృష్ణ

కర్ణాటకలో శ్రవణ బెళగోళలో 143 మీటర్ల ఎత్తైన ఇంద్రగిరి బెట్టమీద జైన మతాచార్యుడైన గోమతేశ్వరుని విగ్రహము 1000 సంవత్సరాలనాటిది. ఇంత బ్రహ్మాండమైన విగ్రహం ప్రపంచంలో మరెక్కడా లేదు. ఈ విగ్రహం ఒకే శిలలో చెక్కబడింది. పన్నెండు సంవత్సరాలకొకసారి ఈ విగ్రహానికి జరిగే మహామస్త



కాభిషేకం మిక్కిలి వైభవోపేతంగా ఉంటుంది. మొట్టమొదటిసారి 1398 ఎ.డి.లో మహామస్తకాభిషేకం జరిగినట్టు లిఖిత ప్రమాణం ఉంది. జైనులకు ప్రధానమైన ఈ పుణ్యక్షేత్రంలో భారతదేశంలో ప్రాచీన రాజుల దిగ్విజయాలను తెలియజేసే ప్రాచీన నిర్మాణాలు ఎన్నో ఉన్నాయి.

హసన్ జిల్లాలో చెన్నరాయ పట్టణ తాలూకాలోగల శ్రవణబెళగోళ . మైసూరుకి 100 కి.మీ.లు మరియు బెంగళూరుకు 160 కి.మీ.ల దూరంలోను ఉంది. కన్నడ భాషలో 'బెళగులం' అంటే తెల్లటి సరస్సు. ఇది ఊరిలో మధ్య ఉంది. శ్రవణుడు అనే సుప్రసిద్ధ జైన మతాచార్యుడు ఇక్కడ నివసించేవాడు. అందుకే దానికి శ్రవణబెళగోళ అనే పేరు వచ్చింది.

ఇక్కడ రెండు బెట్టలు ఉన్నాయి. చంద్రగిరి బెట్ట మరియు ఇంద్రగిరి బెట్ట. ఇంద్రగిరి బెట్టపైన ఎత్తుగా ఉండే ఒక పెద్ద శిలను చెక్కి ఈ విగ్రహాన్ని తయారు చేసారు. ఇక్కడ 'కల్యాణతీర్థం' అనే మరో పుష్కరిణి కూడా ఉంది. 983 A D లో రాచమల్ల సర్దారుడైన చాముండరాయలు దానిని చెక్కించాడు. అరిత్తనంబి అనే సుప్రసిద్ధ శిల్పకారుడు దీనిని చెక్కాడు. రాతి బెట్టలో నిర్మించబడిన 500 మెట్లు ఎక్కి విగ్రహం పాదాలను చేరవచ్చు. ధ్యానరూపంలో అత్యంత సుందరంగా చెక్కబడిన నిర్వాణస్థితిలోనున్న గోమతేశ్వరుని రూపం మిక్కిలి అద్భుతంగాను, ఆశ్చర్యంగాను ఉంటుంది. ఇంతకన్నా వైభవోపేతమింకొకటి లేదని పెర్గూసన్ తన అభిప్రాయాన్ని వెల్లడించాడు. అతి గంభీరంగా ఉన్న ఈ శిలా ప్రతిమ భారతీయ శిల్పకళోత్కృష్టతను వెల్లడిస్తుంది.

●

**ప్రేమ, భక్తి రెండూ ఒకటే**

"పిల్లలను ప్రేమిస్తే మమకారం అంటాము
పెద్దలను ప్రేమిస్తే గౌరవం అంటాము
భగవంతుని ప్రేమిస్తే భక్తి అంటాము"

— అమ్మ

"విలువైన గుణాలలో స్వల్పంగా ఒక దోషమున్నా
అది దోషం అనిపించదు."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి.

— సంపాదకుడు]

1. ఇ. ప్రసాద్, ఎస్.ఎస్.సి., 20 సం.లు., ఇం.నెం. 2-4-680/52, సుందర్ నగర్, కాచిగూడ, హైదరాబాద్-500 027.
పత్రికాపఠనం, స్టాంపుల సేకరణ, రేడియో వినడం.

2 బి. వెంకటరాజు, ఇంటర్ మొదటి సంవత్సరం, 17 సం.లు., ఇం.నెం. 2-4-680/65/2, సుందర్ నగర్, కాచిగూడ, హైదరాబాద్ - 500 027
పత్రికాపఠనం, రేడియోవినడం, కలంస్నేహం.

3. బి. సురేంద్ర కుమార్, బి.ఏ, 25సం.లు., C/o వాసవా ట్రేడర్స్, ఫెర్టిలైజర్స్ షాపు, పొన్నూరు, (గుంటూరు జిల్లా); 522 124.
స్టాంపుల సేకరణ, కలం స్నేహం, నాణెముల సేకరణ.

4. కుమారి జి.ఎన్. ఉషారాణి, 16 సం.లు., D/o జి.ఎస్. నరసింహులు, 75, ఆచారప్పన్ స్ట్రీట్, ఫస్ట్ ఫ్లోర్, మద్రాసు - 600 001.
టివిలో వార్తలు వినడం, చదరంగం ఆడడం, సెలవురోజులలో బీచికి వెళ్లడం.

5. దామరకుంట శంకర్, 24సం.లు., అసరఅల్లి పోస్టు, సిరువంచ తాలూకా, గడచిరోలి జిల్లా, (మహారాష్ట్ర) 442 504.
పుస్తకములు చదువుట, రేడియోవినుట, లోకసేవ చేయుట.

## ఎక్కడ మనస్సు నిర్భయంగా ఉంటుందో



ఎక్కడ మనస్సు నిర్భయంగా ఉంటుందో
ఎక్కడ మనుషులు సగర్వంగా తలెత్తి తిరుగుతారో
ఎక్కడ విజ్ఞానం విరివిగా వెలుస్తుందో
ఎక్కడ ప్రపంచం ముక్కలు ముక్కలై ఇరుకైన
సంసారపు గోడలమధ్య విడిపోదో
ఎక్కడ మాటలు అగాధమైన సత్యంలో నుండి
ఊటలువెడతాయో
ఎక్కడ విరామమెరుగని అన్వేషణ పరిపూర్ణతవైపు
చేతులు చాస్తుందో
ఎక్కడ పరిశుద్ధ జ్ఞానవాహిని నిర్జీవమైన ఆచారపు
ఎడారిలో ఇంకిపోదో
ఎక్కడ మనస్సు నిరంతరం వికసించే భావాలలో
కి, కార్యాలలోకి నడుపబడుతుందో
ఆ స్వేచ్ఛాస్వర్గానికి నాదేశాన్ని మేలుకొలుపు తండ్రీ!
—రవీంద్రనాథ్ ఠాగూర్

"ఉన్నత చరిత్రగల ఉత్తమోత్తములు విశ్వకుటుంబీకులు."

# మీకు తెలుసా?

## నీటిలో పెంగ్విన్ పక్షులు అధిక వేగాన్ని అందుకుంటాయి

నీటిలో పెంగ్విన్ అద్భుతమైన వేగాన్ని



అందుకుంటుంది. ఇంత మహావేగంతో గాలి లోకి 7 అడుగులపైకి ఎగురుతుంది.

* * *

## అమెరికనులు ఐస్‌క్రీమ్‌లు అధికంగా తింటారు

ఏ ఇతర దేశంలోకంటే యుఎస్ఎలో ప్రజలు ఐస్‌క్రీమ్‌ను అధికంగా తింటారు. ఇక్కడ ఒక్కొక్క వ్యక్తి 23 క్వార్ట్స్ కంటే ఎక్కువ ఐస్‌క్రీమ్ తింటాడు.

* * *

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద బైబిల్

ప్రపంచంలో మిక్కిలి పెద్దబైబిల్‌లో 8,043 పుటలుంటాయి. దీని బరువు 1/2 టన్ను. ఇది యు ఎస్ ఎ లాస్ ఏంజెల్స్‌లో లూయీ వాజ్‌మెల్‌చే రబ్బరు అచ్చులతో చేతితో అచ్చువేయబడింది. దీని పరిమాణం 4 అ. $1^1/_4$ అం × 2 అ. 9 1/2 అం.

* * *

## మొట్టమొదటి టెలివిజన్ సాటిలైట్

టెల్‌స్టార్ మొట్టమొదటి టెలివిజన్ సాటిలైట్.

* * *

## మిక్కిలి పెద్ద ఓడ

బ్రిటిష్ సముద్రాలలో ప్రయాణం చేసే 'క్వీన్ ఎలిజబెత్' భారం 83,673 టన్నులు. 1938 లో ప్రవేశ పెట్టబడిన ఈ ఓడ మిక్కిలి పెద్ద ప్రయాణీకుల ఓడ.

* * *

## ప్రపంచంలో అంతరించిపోయిన పెద్ద అగ్నిపర్వతం

అర్జెంటీనా ఆండీస్ పర్వత శ్రేణిలో సెర్రో ఏకాన్‌కాగువా (Cerro Aconcagua) అంతరించిపోయిన మిక్కిలి పెద్ద అగ్ని పర్వతం. 6960 మీటర్ల ఎత్తైన ఈ అగ్ని పర్వతం దక్షిణ అమెరికాలో మిక్కిలి ఎత్తైనది.

* * *

## క్లోసెట్ డ్రామా అంటే ఏమిటి?

నాటక ప్రదర్శనకు కాకుండా శ్రోతలు, ప్రేక్షకులు గల సభలో చదవడానికి వీలైన నాటకము 'క్లోసెట్‌డ్రామా'.

* * *

"తోరణాలు కట్టకపోతే శుభకార్యాలకు శోభరాదు."

## బిలియర్డ్స్ మొట్టమొదట ఫ్రాన్స్‌లో ఆడబడింది

మొట్టమొదట 1429లో బిలియర్డ్స్



ఫ్రాన్స్‌లో ఆడబడింది. తరువాత 1588లో ఇంగ్లండులో ప్రవేశింపబడింది.

* * *

## ప్రపంచంలో రక్షణలేని పెద్ద తీరము

కెనడా మరియు యునైటెడ్ స్టేట్ విభజించుకున్న 9,000 కి.మీ.ల పొడవైన తీరము ప్రపంచంలో రక్షణ లేని పెద్ద తీరము.

* * *

## అల్సేషియన్ ఘ్రాణశక్తి

మిక్కిలి పెద్ద కుక్క అల్సేషియన్ ఘ్రాణ నైపుణ్యం మానవుని ఘ్రాణనైపుణ్యంకంటే ఒక మిలియను రెట్లు ఉత్తమంగా ఉంటుంది.

* * *

## ప్రపంచంలో సగానికిసగం మంది 'టీ' త్రాగుతారు

ప్రపంచంలో 50 శాతం పెద్దవాళ్లందరూ 'టీ' త్రాగుతారు.

* * *

## సాల్లీరైడ్ మొట్టమొదటి అమెరికన్ మహిళా వ్యోమగామిని

మొట్టమొదటి అమెరికన్ వ్యోమగామిని సాల్లీరైడ్ 1983 లో అంతరిక్షంలోకి ఎగిరింది.

* * *

## కప్ప నాలుక నోటిలో ముందునుంచి పెరుగుతుంది

కప్ప నాలుక నోటిలో ముందుభాగంనుంచి పెరుగుతుంది. దీనివల్ల చాలా దూరంగా ఉన్న కీటకాలను, పురుగులను అందుకోగలుగుతుంది.

●

( 36 వ పేజీ తరువాయి)

కాశీనాథ్ త్రంబక్ తెలాంగ్: బొంబాయిలో పుట్టి, పెరిగి, చదువుకున్న ఇతడు గొప్ప సంస్కృత పండితుడు. 'హిందూ లా' నిపుణుడు. మొట్టమొదటి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సమావేశానికి ఇతడు ముఖ్య కారకుడు. స్త్రీ సంక్షేమానికీ, పయోజన విద్యకీ, పతిత జాతుల ఉద్ధరణకీ మిక్కిలి పాటుపడ్డాడు.

* * *

కస్తూర్బా గాంధీ: గాంధీమహాత్ముని ధర్మపత్ని. భర్త జీవితంలో కష్టాలను, సుఖాలను పంచుకున్న మహాసాధ్వి. దక్షిణాఫ్రికా సత్యాగ్రహం నాటినుంచి అన్ని రాజకీయ పోరాటాలలో భర్తను అనుసరించింది. 1942 క్విట్ ఇండియా మూవ్‌మెంట్‌లో పాల్గొన్నందుకు ఈమె చెరబట్టబడింది. చెరసాలలో ఉంటూనే పూనాలో మరణించింది.

●

"పతనమునకు ప్రథమ సోపానాలు మూడు—
నిర్లక్ష్యము, అజాగ్రత్త, పొరపాటు."

# విజయం పొందే వివేకవంతుడు

## మా యోగశక్తి

పూర్వం ఒకప్పుడు చిత్రకూట్ అరణ్యాలలో ఒక గురువు నివసిస్తూండేవాడు. అతడు గొప్ప జ్ఞాని, పండితుడు. ఇతడి కీర్తి నాలుగు దిక్కులా ప్రాకిపోయింది. వీరికి అనేకమంది శిష్యులు ఉన్నారు. ఈ శిష్యులలో సుశీల్, సుధర్మ అనే ఇద్దరు వీరిని మిక్కిలి శ్రద్ధా భక్తులతో సేవిస్తున్నారు.

ఒకరోజున గురువుగారు సుశీల్ ఇంటికి వెళ్ళి 'ఓ శిష్యా! నేను తీర్థయాత్రకు వెళ్ళాలని ఉన్నాను. వెళ్ళేముందు నీకో వస్తువు ఇస్తాను. దానిని బహుజాగ్రత్తగా చూసుకోవాలి. ఇదుగో బఠాణీ గింజ. దీనిని అతి భద్రంగా కాపాడాలి. నేను వచ్చిన తరువాత దీనిని నాకివ్వాలి. నీవు చాలా బుద్ధిశాలివి. విజ్ఞానవంతుడవు. నీవు నా ఉపదేశాలన్నీ బాగా గ్రహించావు అనుకుంటాను. నేను ఈరోజే వెళ్ళిపోతున్నాను. నేను ఎప్పుడు తిరిగి వస్తానో చెప్పలేను' అన్నాడు. దానికి శిష్యుడు సమ్మతించి దానిని జాగ్రత్తగా ఉంచుతానని వాగ్దానం ఇచ్చాడు. గురువు వెంటనే వెళ్ళిపోయాడు.

సుధర్మ ఇంటికి కూడా గురువు వెళ్ళాడు. అతడికి కూడా ఒక బఠాణీ గింజను ఇచ్చి వెళ్ళిపోయాడు. సుధర్మ ఆ గింజను జాగ్రత్తగా ఉంచి గురువుగారు వచ్చిన వెంటనే ఇచ్చేస్తాను అని చెప్పాడు.

గురువుగారు తీర్థయాత్రలు చేసుకుంటూ ఐదు సంవత్సరాలు గడిచిన తరువాత వచ్చి మొదట సుశీల్ ఇంటికి వెళ్ళారు. సుశీల్ గురువుగారికి ఘనంగా స్వాగతం పలికి సపర్యలు చేసాడు. అనంతరం గురువుగారు సుఖంగా కూర్చున్న తరువాత బంగారపు పెట్టె గురువుగారి ముందు పెట్టి మీరిచ్చిన గింజ అతి

### 24 గంటలలో నీవు సాధించేది



సగటు భారంతో ఉన్న యువకుడవు అయితే 24 గంటలలో,
నీ హృదయం 103,689 సార్లు కొట్టుకుంటుంది.
శరీరంలో రక్తం 168,000,000 మైళ్ళు ప్రవహిస్తుంది.
నీవు 23,040 సార్లు ఊపిరి తీసుకుంటావు.
నీవు 438 ఘన అడుగులగాలిని లోపలకు పీల్చుకుంటావు.
నీవు $3\frac{1}{4}$ పౌండ్లు ఆహారాన్ని తింటావు.
నీవు 2.9 క్వార్టుల ద్రవ పదార్థాలను త్రాగుతావు.
నీవు 7/8 పౌండ్ల వ్యర్థ పదార్థాలను విసర్జిస్తావు.
నీవు అనవసరమైనవికూడా చేరి 4,800 మాటలు మాట్లాడతావు.
నీవు 750 కండరాలను కదులుస్తావు.
నీ గోళ్ళు .000046 అంగుళం పెరుగుతాయి.
నీ జుట్టు .01714 అంగుళం పెరుగుతుంది.
నీ మెదడులో 7,000,000 కణాలు పనిచేస్తాయి.

—మార్క్ ఉక్లేమ.

భద్రంగా ఇందులో ఉంచాను తీసుకోమన్నాడు. గురువుగారు సంతోషంతో చిరునవ్వు నవ్వి ఆ పెట్టెను తనతో తీసుకురమ్మని సుధర్మ ఇంటికి వెళ్లాడు. తీర్థయాత్రలకు వెళ్లివచ్చిన గురువుగారిని చూసిన వెంటనే సుధర్ముడికి పట్టరాని సంతోషం కలిగింది. సుధర్ముడు గురువుగారి పాదపద్మాలను పూజించాడు.

గురువుగారు 'నేను ఇచ్చిన గింజ జాగ్రత్తగా పెట్టావా?' అని అడిగాడు. దానికి శిష్యుడు 'గురువర్యా! మీరు వెళ్లిన తరువాత నేను దీర్ఘంగా ఆలోచించి మీరు చెప్పినది గ్రహించాను. సాధారణంగా అనుసరింపదగిన విజ్ఞానం భోదించారు. బఠాణీగింజ అంత విలువైనదీ, అమూల్యమైనదీ కాదు. బస్తాల కొద్దీ బఠాణీలు తీసుకు రావలసింది ఒకే ఒక గింజ ఇచ్చి దానిని జాగ్రత్త పెట్టమన్నారు. మీ ప్రయాణానికి, క్షేత్రాటనకి కాలపరిమితి లేదు. ఇన్నేళ్లపాటు ఒక గింజను ఎలా దాచ గలను? దానిని భద్రంగా ఉంచి సకాలంలో భూమిని త్రవ్వి దానిని నాటాను. అది పెరిగి ఆమొక్క ఒక శేరు బఠాణీలు ఇచ్చింది. నాకు కొంతపొలం ఉంది. ఆ బఠాణీ గింజలన్నీ తిరిగి చల్లాను. అవి పుష్కలంగా పండాయి వాటిని అమ్మి, ఆ డబ్బుతో తిరిగి కొంత భూమిని సంపాదించాను. తిరిగి గింజలు చల్లాను. పంట బాగా పండింది. ఈ సౌభాగ్యమంతా మీరిచ్చిన గింజవల్లే కలిగింది. ఇదంతా మీదే" అన్నాడు.

శిష్యులందరిలో సుధర్ముడు వివేకవంతుడని, మంచి ప్రజ్ఞాశాలి అని గురువుగారికి తెలుసు. వెంటనే సుధర్ముని ఆశ్రమంలో శిష్యులందరిలో పెద్దవాడిని చేసి ఆశ్రమం సంరక్షించమని చెప్పి గురువుగారు అడవిలోకి ముముక్షువుగా వెళ్ళిపోయాడు. ●

## ప్రతిగ్రహము సూర్యుని చుట్టూ 'పరావలయం'లో తిరుగుతుంది



*1609 లో జర్మన్ ఖగోళ శాస్త్రజ్ఞుడు జొహన్నెస్ కెప్లెర్ వివిధ గ్రహాల గతులను పరిశీలించి, గ్రహాలు సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తాయని, ఈ పరిభ్రమణ మార్గం కక్ష్య వర్తులమార్గంకాదని, దీర్ఘ వలయాకారపు పరావలయం మార్గంలో సంచరిస్తా యని నిరూపించాడు*

*గ్రహ కక్ష్యల పరావలయ మార్గాలన్నిటికీ సరిగా కేంద్ర స్థానంలో సూర్యుడు ఉండడు భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమించినప్పుడు భూమి సూర్యునికి 147,250,000 కి.మీ.ల దూరంలో భూక క్ష్యచివర ఉంటుంది. కక్ష్యకు మరియొక దూరం నుండి సూర్యునికి 152,078,850 కి.మీ.ల దూరంలో ఉంటుంది. భూమికి, సూర్యునికి మధ్య దగ్గర దూరంకంటే దూరంగా ఉండే దూరం 4 శాతం అధికం.*

*బుధుడు సూర్యుని చుట్టూ తిరిగేటప్పుడు ఒకచివర బుధ కక్ష్యకు 45,000,000 కి.మీ, మరియొక చివర 70,800,000 కి.మీ.ల దూరంలోను సూర్యుడు ఉంటాడు. సూర్యుని నుండి బుధుని దగ్గర కంటే, దూరంగా ఉండే దూరం 50 శాతం అధికం.*

# ఆరోగ్యానికి బాదంపప్పు

బాదం కాయలే ఆల్మండ్స్ శరీర ఆరోగ్యానికి, శరీరపుష్టికి, నిర్మాణానికి మరియు దీర్ఘాయుస్సుకి సహకరించే పోషకాంశాలన్నీ వీటియందు ఉండటం వల్ల ఇవి మన నిత్య ఆహారంలో ముఖ్యమైన పదార్థంగా ఉండితీరాలి

ఈ బాదం గింజలలో 20 శాతం శరీర నిర్మాణానికి, రక్తపుష్టికి అవసరమైన మాంస కృత్తులు ఉన్నాయి వీటిలో ఇంకా సులభంగా జీర్ణమయ్యే పాలీఅన్‌సాచురేటెడ్ ఫాట్ - క్రొవ్వు 50 శాతం, 4 శాతం కార్బోహైడ్రేటులు, కొద్ది పాటి సహజమైన చక్కెర ఉంటాయి ఇవి శరీర పోషణకు మిక్కిలి అవసరం




వీటియందు - భారాలను బట్టి సరిపోలిస్తే బీటుదుంపలలో లభించే విటమిను B (థయామిన్) 10 రెట్లు, గ్రుడ్డులో లభించే విటమిను B (రిబోఫ్లావిన్) రెండు రెట్లు, ముడి గోధుమలో లభించేటంతటి నియాసిన్, అతికొద్దిగా విటమిను E ఉన్నాయి వీటియందు కాల్షియం ప్రమాణం పరిశీలిస్తే పాలలో లభించేదానికి రెట్టింపు, మీగడలో ఉన్నంత భాస్వరం, బీటుదుంపలో లభించే మంచి ఇనుము కూడా ఉన్నాయి ఇవన్నీ కూడా చిన్నపిల్లల శరీరంలో ఎముకల అభివృద్ధికి, ఆరోగ్యవంతమైన దంతాల పెరుగుదలకు, వృద్ధులు యౌవ్వనంగా ఉండడానికి సహకరిస్తాయి

బాదంపప్పు ప్రతీరోజూ అతికొంచెం - 10 గ్రాములు తిన్నా చాలు నీలో అద్భుతమైన ప్రక్రియ జరుగుతుంది కాయల పై పెంకును కొట్టి లోపలి గింజలపై గోధుమరంగు తొక్కను తీసి పచ్చివి అలాగే తినవచ్చు లేక వేరుశనగ గింజలులాగా కొద్దిగా వేయించి ముద్దగా నూరి పొద్దుటిపూట పాలలోగానీ, గంజిగాగానీ కలుపుకోవచ్చు పొంగల్‌లో, పాయసంలో, లడ్డూలలో వేసుకోవచ్చు. పాలలో కలిపేటప్పుడు కొద్దిగా పళ్ళరసం కూడా చేర్చటం మంచిది

## వాయిదాలు వేయకు!

కాలం విలువ తెలుసుకో ప్రతీక్షణం పట్టుకో వదలకు. అనుభవించు సోమరితనం వద్దు బద్ధకం వదలుకో టలాయించకు ఈ క్షణం ఇప్పుడు చేయవలసినది రేపు మాపు అని వాయిదా వేయకు

-లార్డ్ ఛెస్టర్‌ఫీల్డ్

## జంతువులకు పక్షులకు భాషలు ఉన్నాయి

జంతువులు సాధారణంగా శబ్దంచేత, వాసన చేత, అంగవిక్షేపం వల్ల పరస్పర భావాలు తెలియజేసుకుంటాయి రానున్న అపాయాలను తెలియజేసుకోడానికి జతకూడడానికి పిలవడానికి పక్షులు రకరకాల కూతలు కూస్తాయి

"కలం పట్టడం కంటే హలం పట్టడం ఎక్కువ గౌరవప్రదం అని తెలుసుకునే వరకూ ఏ జాతీ బాగుపడదు"

# భయంతో లాభం పొందండి

ఆర్ట్ ఫెట్టింగ్

భీతివల్ల పనులు అద్భుతంగా సిద్ధిస్తాయి కానీ భయానికి లొంగిపోతే ఆర్థికంగా, శారీరకంగా, మానసికంగా నిన్ను నీవు సర్వనాశనం చేసేసుకుంటావు. ఎన్నికష్టాలైనా ఓర్చుకుని కొంతమంది వాస్తవాన్ని అనుభవిస్తారు. జరిగే దానికి అసలు భయపడిపోరు. అయితే కొంత



మంది ఏం జరుగుతుందో అనే భయంవల్లనే క్రుంగిపోతారు. భయాన్ని అవగాహన చేసుకుంటే భయంతో సులభంగా ఎన్నో లాభాలు పొందవచ్చు.

భయమనేది బాధాకరమైన మానసిక వేదనగా పరిణమించే ఉద్వేగం. ఏదో చెడుపు కలుగుతుంది అని రాబోయే అపాయానికి దిగులు పడిపోతాం. భయం మనస్వాధీనంలో లేకపోతే ఆలోచనాశక్తి పోతుంది. మంచి చెడ్డల వివేక జ్ఞానం ఉండదు. మనిషిని క్రుంగదీయడం భయానికి ఎంతో సులభసాధ్యం. అనవసరమైన విషయాలు పెరిగిపోతాయి. అసలు విషయం అవకతవకలై పోతుంది.

మానవుని మనస్సు కంప్యూటర్‌లా పని చేస్తుంది. మనస్సులో భయం పూర్తిగా నీ శరీర విధానం మీద ప్రవర్తిస్తుంది. గుండె నొక్కుకు పోతుందనిపిస్తుంది. భయం ఏవిధంగా ప్రవర్తిస్తుందో తెలుసుకుంటే దానిని లాభకరంగా వినియోగించుకోవచ్చు.

1. భయంవల్ల ఉద్రేకం కలుగుతుంది: లాభం పొందాలంటే, లేక ఆసక్తి పెరగాలంటే ఉద్రేకం పొందాలి. ఏదైనా ముఖ్యమైన పనిచేసే ముందు భయంగా ఉంటే ఈ విషయం జ్ఞాపకంపెట్టుకో. ఉద్రేకం కలిగించనీ. ఆ ఉద్రేకం వల్ల నీ ఉత్సాహం పెరుగుతుంది.

2. భయంవల్ల చురుకుదనం ఏర్పడుతుంది: మామూలుగా ఉన్నప్పుడుకంటే భయపడ్డప్పుడు వేగంగా పరుగెత్తుతావు. ఒకసారి కుక్క తరుముకు వస్తూంటే వేగంగా ఆరు అడుగుల గోడదూకేసి తప్పించుకున్నాను నేను.

3. భయంవల్ల సామర్థ్యం పెరుగుతుంది: తమ పిల్లలను సంరక్షించాలనే భయంతో ఎన్నెన్నో అసాధ్యమైన అద్భుతాలు ప్రదర్శించిన వీరమాతలు ఉన్నారు.

4. భయంవల్ల ఇంద్రియజ్ఞానం పెరుగుతుంది: ముఖ్యంగా భయంవల్ల స్పర్శజ్ఞానం పెరిగిపోతుంది.

5. భయంవల్ల ఆలోచనలను తెలుసుకుంటావు: ఇది సాధారణంగా భయంపట్టుకున్నప్పుడు ఇతరులు ఎలా ప్రవర్తిస్తున్నారో గమనిస్తే ఏర్పడుతుంది.

(మిగతా 55 వ పేజీలో

"దర్పంతో దానం చేసినంత మాత్రాన ధర్మాత్ముడు కాడు."
—పి. సీతారామరాజు

# మాటవరసకి మాట

ఏభాషలోనైనా భాషయొక్క శబ్ద స్వరూపం లోను, నిర్మాణంలోను జరిగే మార్పుల వల్ల, పదజాలానికి అర్థంలో కలిగే మార్పుల వల్ల భాషాపరిణామం జరుగుతూంటుంది. పదజాలానికి అర్థంలో కలిగే మార్పులవల్ల అర్థ విపరిణామం కూడా జరుగుతుంది. పదస్వరూపం మార్పు చెందకుండానే అర్థ విపరిణామం జరుగవచ్చు. పదస్వరూపం మారినప్పుడు అర్థం మార్పుచెందాలనే నియమం ఉండదు. తెలుగు భాషా పదజాలంలో ధ్వని అనుకరణ పదాలు, నిష్పన్న రూపాలు, తద్ధిత రూపాలు, సమాసాలు, శబ్ద పల్లవాలు, ఆమ్రేడిత రూపాలు, లక్ష్యార్థ ప్రయోగాలు, జాతీయాలు అనేకార్థ పదాలు ఉన్నాయి. తెలుగు దేశ చరిత్రలో విజయనగరం, కొండవీడు, నెల్లూరు, అద్దంకి, రాజమహేంద్రవరము, వరంగల్లు, చంద్రగిరి వేరు వేరు కాలాలలో రాజధానులుగా ఉండేవి. అంతేగాక కృష్ణా, గోదావరి పరిసర మధ్యమండలం విద్యకు, సౌభాగ్యానికి, సంస్కృతికి విద్యావంతులకు ఆటపట్టయింది. తెలుగు దేశంలో ఏ ఒక్కటీ కొన్ని శతాబ్దాల పాటు సాంస్కృతిక కేంద్రంగా రాణించలేదు. కాబట్టి ఒకే పదం ఆయాప్రాంతాల పలుకుబళ్లతో రూపవైవిధ్యం పొందింది. ఒకే పదానికి ముఖ్యమైన అర్థంతో పాటు అర్థవ్యాప్తివల్ల అనేక అర్థాలు ఏర్పడ్డాయి. మాటవరసకి తెలుగు భాషలో 'మాట' అనే పదానికి అనేక అర్థాలు ఏర్పడ్డాయి.

అసలు మాట అంటే వచనము, పదము, నింద, వృత్తాంతము అనే రూఢి అర్థాలు ఉన్నాయి. ఇవేగాక పలుకు, వాక్యము, సందేశము, వార్త, చరిత్ర కథ, ప్రార్థన, తిట్టు అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఇన్ని అర్థాలున్న పదం మాట పలుకుబడులలో సహజార్థ మిచ్చేవి ఉన్నాయి, గూఢార్థమిచ్చేవి ఉన్నాయి, రూఢ్యార్థ మిచ్చేవి ఉన్నాయి, అన్యార్థమిచ్చేవి ఉన్నాయి, అపార్థాలు ఇచ్చేవి ఉన్నాయి.

మాటలాడుట ప్రసంగం అవుతుంది. మనస్సు నిలకడలేకుండా మాటిమాటికి మనస్సు మార్చుకునే వారు గడియకు ఒక మాట చెబుతారు. వాగ్దత్తం చేసేవారు ఆడిన మాట తప్పరు. వాగ్దానం చేసేవారు మాట ఇస్తారు. చెప్పిన ప్రకారం చేయకపోతే మాట తప్పిన వారవుతారు. అన్నమాటను తప్పని వారు పెద్ద మనుషులే, వందనీయులు.

## కేంద్రనాడీ మండలం 10,000 వార్తలను మెదడుకు పంపుతుంది



మన శరీరంలో కేంద్రనాడీమండలం ప్రతి ఒక్క సెకండుకీ 10,000 వార్తలను మెదడుకు పంపుతుంది. ఈవిధంగా మానవుని జ్ఞాపకశక్తి అపూర్వమైన అద్భుతశక్తిగా రూపొందుతుంది.

"విశ్వాసమున్నచోట ప్రేమ ఉంటుంది. ప్రేమఉన్నచోట శాంతి ఉంటుంది. శాంతిఉన్నచోట సత్యం ఉంటుంది. సత్యం ఉన్నచోట ఆనందం ఉంటుంది. ఆనందం ఉన్నచోట భగవంతుడుంటాడు."

మాటల చమత్కారం వ్యంగ్యం అవుతుంది. మాటలలో పట్టుదల ఉంటే మాటపట్టు ఉంటుంది. నిందలపాలైతే మాటపడతారు. నిష్ఠూరాలాడేవారు ఊరికే మాటలాడతారు. ముందే జాగ్రత్తగా ఉండాలి. మాట జారిన తరువాత ఏమనుకున్నా ఏంలాభం ఉండదు. తిట్లు ప్రారంభిస్తే మాటలు ముదురుతాయి. ఈకాలంలో ఇల్లు కట్టడం, పెళ్లిచేయడం మాటలా? కొందరు మాటవరసకు ఏదైనా చెప్పినా నిజమే అని నమ్మేస్తారు. ఇంట్లోపని చేసేవారైనా అడ్డమైన మాటలు అంటే మాటపడరు. కొందరు అడిగిన దానికి జవాబుచెప్పకుండా మాటామంతీ లేకుండా కూర్చుంటారు. అసలు చేయవలసిన పని సాధిస్తే గొప్పవాడివే అన్నమాట. కొందరికి దగ్గర ఉంటే ఒకమాట, దూరమైతే ఇంకోమాట. నోరు మంచిదైతే ఊరంతా మంచిదే అవుతుంది. కొంటెమాటలతో కొంపలు అంటు కుంటాయి. అంతం లేకుండా మాట్లాడే వారు మాటలకు పట్టుకుంటే వదలరు. నీకు నాకు అంతరాలు, అభిప్రాయాలు వేరైతే నీ మాట వేరు, నా మాట వేరు అవుతుంది. ఇలా ఇంకా ఎన్నో ఉన్నాయి.

ఇంత బ్రహ్మాండమైన మాట భగవంతుడు మనందరికీ ప్రసాదించిన వరం. భగవంతుడు ప్రసాదించిన ఈ 'మాటను' మనం వ్యర్థం చేసుకోకూడదు. అనవసరంగా మాట పడకుండా లాభసాటిగా ఉపయోగించుకోవాలి. దీనికి మంచిపట్టుదల, అభ్యాసం ఉండాలి. మాట మంచితో మర్యాదను అభివృద్ధి చేసుకోవాలి మనిషి శాశ్వతమా! మాటమాత్రం కలకాలం ఉండిపోతుంది. అంతేనా! పదునైన కత్తికి లేని వాడి వాక్కుకు ఉంటుంది. మంచి మాటతో శీలాన్ని పెంచుకోవచ్చు. మాట్లాడే టప్పుడు మన పంకల్పాలు, వాక్కులు ప్రతి బింబిస్తాయి. అసత్యపు మాటలు అనర్థాన్ని తెచ్చిపెడతాయి. మౌనం వేయి మాటలకన్నా అతిగంభీరంగా శ్రావ్యంగా ఉంటుంది. ధర్మ బద్ధంగా ఉండడం నేర్చుకుంటే సంకల్పాలను ఉన్నదున్నట్టుగా చెప్పగలుగుతాము. అధిక ప్రసంగం వల్ల మాటకు, మనసుకు పొత్తు కుదరదు. మాట్లాడేటప్పుడు సంకల్పం, భావం, ఆచరణ అన్నిటికీ సమైక్య భావం ఏర్పడాలి. నీవు పలికే పలుకులో ఏకమైపోయి ఉచ్చరించాలి. మాటలు దిగమ్రింగకూడదు. మితంగా మాట్లాడడం అభ్యాసం చేసుకోవాలి. సాధ్యమై నంత తక్కువగా మాట్లాడి సాధ్యమైనంత ఎక్కువగా వినడానికి ప్రయత్నించాలి. ముందు వెనుక, మంచి చెడ్డ ఆలోచించి మాటలాడుతూండాలి. మాట్లాడే మాటలు ఎదుటివారికి ఇబ్బంది కలిగించేవిగా ఉండ కూడదు. అర్థభరితంగా, ఆసక్తి దాయకంగా మాట్లాడాలి. నిత్య జీవితంలో అనేక సన్నివేశా లలో అనేక మాటలు మాట్లాడుతుంటాం. మాట ప్రభావం మాటకాదు. మాటలో ఎంతోశక్తి ఇమిడి ఉంటుంది. మానవుడికి బలాన్ని ఇచ్చేది మాటే, బలాన్ని పోగొట్టేది ఈ మాటే. మంచి మాటతో ఎంతైనా సాధించవచ్చు. కార్య విఫలత, సఫలత కూడా మాట మీదే ఆధారపడి ఉంటాయి. జాగ్రత్తగా తూచి తూచి యోచించి మాట్లాడు.

— తాడూరి

## ప్రపంచ చరిత్రలో అధిక రక్తపాతమైన శతాబ్దం

ప్రపంచ చరిత్రలో 20వ శతాబ్దం అత్యధిక రక్తపాతమైన శతాబ్దంగా పరిగణించబడుతుంది. వివిధ యుద్ధాలలో 100 మిలియను మంది ప్రాణాలను కోల్పోయారు. రెండు ప్రపంచయుద్ధాలలో 58 మిలియను మంది జనం చనిపోగా, ఇతర యుద్ధాలలో 40 మిలియను మంది మరణించారు.

"ఆకాశం—కుండ, గిన్నె, చెంబు మొదలైన వాటి లోపలా ఉంటుంది, వాటికి బయటా ఉంటుంది. అలాగే [illegible] అంతరాత్మ రూపాలలోనూ, రూపాలకవెలుపలా ఉంటుంది."

# మనస్సుని మచ్చిక చేసుకోండి

## స్వామీ సత్యానంద సరస్వతి

పూర్వం ఒక రాజు నివసిస్తూండేవాడు, ఆ రాజు దగ్గర ఒక అందమైన గుర్రం ఉండేది. అది చాలా బెదురు గుర్రం. దానిని మచ్చిక చేయడమే బ్రహ్మాండమైపోయింది. రాజు విసుగుచెంది చివరకు దానిని లొంగదీసిన



వారికి మంచి అపురూపమైన బహుమానం ఇస్తానని ప్రకటించాడు. రాజుగారిచ్చే బహుమానం అంటే అందరికీ ఆశే. ఎంతోమంది ఆగుర్రాన్ని లొంగదీయడానికి వచ్చి తగిన ప్రయత్నాలు చేసారు. తమశక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించారు. కానీ ఏమీ లాభంలేక పోయింది. ఎంతటి బలవంతులైనా ఆగుర్రాన్ని సాధువుగా మార్చలేక పోయారు. వచ్చిన వారంతా విరమించుకుని వెనక్కి మళ్లారు.

కొన్నాళ్లకి ఒక కొత్త వ్యక్తి ఆ గుర్రాన్ని పట్టుకుని దానికి బెదురు లేకుండా మెల్లిగా నడిపించుకు వస్తూంటే రాజుగారు చూచి ఆశ్చర్యపోయి 'ఇంత మంది హేమాహేమీలు దీనిని మచ్చిక చేయలేక పోయారు. నీవు దీనిని ఎలా లొంగదీసావు?' అని అడిగాడు. గుర్రాన్ని మచ్చిక చేసేవాడు 'రాజా! మీ గుర్రాన్ని భయపెట్టి దానితో పోరాడటానికి బదులు దాని ఇష్టానుసారం పరుగెత్తనిచ్చాను. కొంతసేపటికి అది ఆయాసపడిపోయి అణకువతో లొంగిపోయింది'' అన్నాడు.

అదే విధంగా మన మనస్సుకూడా. తొందరపడిపోయి మనస్సుతో పోరాటానికి దిగకూడదు. పోరాటానికి దిగితే మనస్సు మరింత ఉద్రేకించి పోతుంది. స్వాధీనంలోకి రాదు. దీనికి గుర్రాన్ని లొంగదీసిన వివేకవంతుడు అనుసరించిన మార్గమే అనుసరించాలి. ఉద్రేకించిన మనస్సును దాని ఇష్టం వచ్చినట్లు చెలరేగనిస్తే కొంతసేపటికి నీ మనస్సు నీ స్వాధీనంలోకి వచ్చేస్తుంది. మనస్సును కళ్లాలతో బిగించవద్దు. జాగ్రత్తగా గమనిస్తే దానంతట అదే శాంతిస్తుంది.

●

### ఎక్కడ కొట్టాలో తెలుసుకోడం

ఒక పెద్ద ఫ్యాక్టరీలో అకస్మాత్తుగా మిషను ఆగిపోయి పనిచేయడం మానివేసింది. రిపేరు చేసేవానిని పిలుచుకువచ్చారు. అతడు మెషీను మీద సుత్తితో ఒక దెబ్బ వేసాడు. వెంటనే మిషను పనిచేయడం ప్రారంభించింది. అతడు రూ. 500 లకు బిల్లు ఇస్తే మానేజర్ ఒకసారి సుత్తితో కొట్టినందుకు అంత పెద్ద బిల్లా అని ఆశ్చర్యపడి బిల్లును దేనికి ఎంతైందో విడివిడిగా వ్రాసి ఇమ్మన్నాడు. సుత్తితో ఒకసారి కొట్టినందుకు ఒక రూపాయి, ఎక్కడ కొట్టాలో తెలుసుకోడానికి రూ. 499లు అని అతడు బిల్లు రాసి ఇచ్చాడు.

"మీకు కష్టాలు వచ్చినప్పుడు హిమాలయంలా స్థిరంగా నిలబడండి. ఇతరుల కష్టాలకు గంగలా కరిగి ప్రవహించండి."

# అక్కడా-ఇక్కడా

## 18 మిలియనువేల గ్రుడ్లు

నేడు ముఖ్యంగా పంజాబు, మహారాష్ట్ర, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లలో 60,000



కోళ్ల ఫారాలు ఉన్నాయి. అయినా దేశంలో గ్రుడ్ల ఉత్పత్తి చాలా తక్కువ  మిలియను వేలు మాత్రమే.

— 'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

* * * *

## 40 సంవత్సరాలలో 15,220 అంత్యక్రియలు సందర్శించాడు

యూరప్ స్పెయిన్‌లో మాంజనేర్స్‌లో జోస కాబా అల్వరేజ్ అనే వ్యక్తికి ఒక వింత హాబీ ఉంది. ఇతడు అనేక మంది అంత్య క్రియలకు హాజరయాడు. 1913 లో ప్రారంభించి 40 సంవత్సరాలలో 15,220 అంత్యక్రియలకు హాజరైయాడు.

* * *

## మందులకు లొంగని మలేరియా పారసైట్

మానవులను ఆశ్రయించి జీవించే మలేరియా దోమలు ఏ మందుకు లొంగకుండా ఉన్నాయని ఆస్ట్రేలియాలో క్వీన్స్ లాండ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ రీసెర్చి డైరక్టరు డా చెవ్ కిడ్‌సన్ చెబుతున్నారు. ఇక అయిదు మొదలు పది సంవత్సరాలలో దోమలవల్ల కలిగే రోగాలకు ఇప్పుడు వాడుకలో ఉన్న ఔషధాలు ఏవీ పనిచేయవు.

* * *

## 5.36 మిలియను కుష్టురోగులు

వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ వారి సమాచారం ప్రకారం ప్రపంచంలో సుమారు రెండున్నర లక్షల కుష్టురోగులు గ్రుడ్డివారై పోతున్నారు, లేదా వారికి దృష్టి ఎక్కువగా చెడిపోతూంది. దక్షిణ ఆసియా దేశాలలో ఉన్న 5.36 మిలియను కుష్టురోగులు విపరీతమైన సమస్యగా పరిణమించారు. ఇది ప్రపంచంలో ఉన్న మొత్తం కుష్టురోగులలో సగం. ●

## కోకోకోలా కథ

*1896లో పెద్దపెద్ద మాదుకాళ్ల బానలలో ఉత్సాహం కలిగించే కొత్తరకం పానీయాలను తయారుచేయడానికి ప్రయోగాలు చేసే డా. జాన్ ఎస్. పెంబర్టన్ ఒకరోజున నీళ్లలో పంచదార, రకరకాల సహజంగా లభించే ఎసెన్సులు కలుపుతూ వెళ్లాడు. దీనిని త్రాగి చూసిన ఒక స్నేహితుడు ఉపాయంగా 'జాక్‌పాట్‌ని కొట్టావు, దీనికి కోకోకోలా అనిపేరు పెట్టు' అన్నాడు. ఈ రహస్యాన్ని అమ్మిన తరువాత పెంబర్టన్ మరణించాడు. కోకోకోలా తయారుచేసే రహస్యంవల్ల అనేకవేల మిలియను డాలర్ల లాభం వస్తూంది. దీని పాళ్లలా ఉపయోగించే విధానం ఇద్దరికే తెలుసు. భద్రతకోసం వీరిద్దరు ఒకే కారులోగాని, రైలులోగాని, విమానంలోగాని ప్రయాణం చేయరు.*

"ఎవడు వివేకవంతుడైన (సారథి) బుద్ధిని కలిగి ఉంటాడో, ఎవడు (కళ్లెం) మనసును తన ఆధీనంలో ఉంచుకుంటాడో అటువంటి రథికుడు ప్రపంచాన్ని దాటి పరమపదాన్ని పొందుతాడు."

# అరటిపండ్లు

డా. హెచ్.ఎమ్.దేశాయ్

బాగా ముగ్గిన అరటిపండ్లు చాలాపుష్టికరమైనవి ఎక్కువ చక్కెర కలిగిన అరటిపండ్లలో కొద్దిగా ప్రొటీనులు, ఇనుము, ఖనిజము, A $B_1$ మరియు C విటమినులు ఉంటాయి. అరటిపండ్ల ఆహారవు విలువ కూడా చాలా అధికం. మధ్యరకం పరిమాణం కలిగి బాగా



పండిన అరటిపండులో సుమారు 7 ఔన్సుల నారింజ రసానికి సమానమై 90 కాలరీల ఆహారవు విలువ ఉంటుంది. పచ్చి లేక పండని అరటికాయలలోగల 20 మొదలు 30 శాతం పిండిపదార్థం కాయపండినప్పుడు అదే పరిమాణంలో చక్కెరగా మార్పు చెందుతుంది.

అరటిపండులోగల ఇనుము చాలా తక్కువ. మనకు ప్రతీరోజూ అవసరమైన ఇనుము కూడా చాలా తక్కువే. ఒక ఔన్సులో 1/2000 వంతు మాత్రమే. శరీరంలో రక్తానికి ఎరుపు రంగునిచ్చి శరీరంలో వివిధభాగాలకు ప్రాణవాయువును సరఫరా చేసే హెమొగ్లోబిన్ తయారీకి ఈఇనుము మనకు చాలా ముఖ్యం.

కంటిరేచీకటి (night blindness) నివారణకు కొంత పరిమాణము విటమిను A అవసరం విటమిను A లోపం వల్ల క్జైరోప్తాల్మియా (xerophthalmia), కంటిపాపలో పారదర్శకమైన ముందు భాగము కార్నియా (cornea) మెత్తబడిపోవుట, కెరటొమలేసియా అనే తీవ్రమైన కంటిరోగము, చర్మం బిరుసెక్కుట, దంతాలు క్షీణించిపోవుట, ఇంకా వివిధ నరాల రోగాలు సంభవిస్తాయి.

విటమిను B లోపిస్తే అలసట, తలనొప్పి, వికారము, వాంతి, చేతులు కాళ్లు తిమ్మిరులు ఎక్కుట మొదలైన ప్రథమలక్షణాలతో కూడిన బెరిబెరి (Beriberi) రోగం సంభవిస్తుంది.

## సుభాషితాలు

ఎంత చదువు చదివి యెన్నైతి విన్నను
హీనుడవగుణంబు మానలేడు
బొగ్గు పాల గడుగ బోవునా నైల్యంబు
విశ్వదాభిరామ వినురవేమ!

[నల్లటి బొగ్గును పాలతో ఎన్నిసార్లు కడిగినా ఆ నలుపు పోనట్లు, ఎంత చదివినా, ఎన్ని మంచి మాటలు విన్నా నీచుడు చెడ్డ గుణాలను వదులడు.]

• • •

పత్వసంగతోడ పలితనగారాదు
తాను చేసినట్టి దానఫలము
ఉల్లమందు పరవకుండుటే యోగంబు
విశ్వదాభిరామ వినురవేమా!

[తాను చేసిన దానముయొక్క ఫలము ఇష్టమున్నా లేకపోయినా లభిస్తుంది కాబట్టి ఫలమును గురించి ఆలోచించక్కర్లేదు.]

"నేర్పులేనివాడు సుఖాన్ని కోరి కూడా తెలియక దుఃఖాన్ని కలిగించే పనులు చేస్తాడు."

ఇదిబాగా ముదిరినప్పుడు ఊపిరి ఆడకపో వడం, గుండెదడ, నరాలవాపు, ఏర్పడ తాయి. సకాలంలో చికిత్సపొందకపోతే గుండె పోటు వల్ల మరణం సంభవిస్తుంది.

విటమిన్ C (ఎస్కార్బిక్ ఆసిడ్) ఆంటిస్కర్వీ విటమిను. అలసట, ఆయాసము, బడలిక, గుండెకొట్టుకొనుట, నోటిలో దంతవు చిగుళ్లు మెత్తబడి వాటివెంబడి రక్తము కారుట, దంతములు ఊడిపోవుట, శరీరం అంతటా అక్కడక్కడ రక్తం స్రవించుట, ముక్కుద్వారా రక్తము కారుట స్త్రీలలో అత్యధిక ఋతు స్రావము మొదలైన లక్షణాలన్నీ విటమిను C లోపంవల్ల కలుగుతాయి.

అరటిపండ్లవల్ల శరీరంలో అధికంగా క్రొవ్వు ఏర్పడదు. వీటిలో చాలాకొద్దిగా 0.2 శాతం క్రొవ్వు ఉంటుంది. ఈ క్రొవ్వు శాకాసంబంధ మైన క్రొవ్వు. అందుచేత దీనివల్ల రక్తంలో కొలెస్టరాలు ఏర్పడి ధమనులకు అపాయం కలుగదు.

సాధారణంగా మధుమేహం (diabetes) తో బాధపడేవారు, వంచదార అధికంగా తిన రాదనివారు అరటిపండ్ల వాడకంలో చాలా జాగ్రత్తను వహించాలి. అధికంగా చక్కెర ఉపయోగిస్తే ధమనులు గట్టిపడిపోతాయి.

బాగా పండిన అరటిపండ్లు సులభంగా జీర్ణమవుతాయి. అరటిపండ్లు పచ్చని పసుపు రంగులో ఉండి పైన ఇటుకరంగు మచ్చలు ఏర్పడినప్పుడు బాగా పండినవని తెలుసుకో వచ్చు. కొనలు ఆకుపచ్చగా ఉన్న పండ్లు సగం పండిన అరటిపండ్లు. వీటిలో పిండి పదార్థం పూర్తిగా చక్కెరగా మారి ఉండదు. అటువంటి అరటిపండు వంటకు పనికి వస్తుంది.

బాగాముగ్గిన అరటిపండ్లు కొద్దిగా విరేచన కారి. రాత్రి పడుకునేముందు రెండు మూడు అరటిపండ్లు తినడం చాలా ఆరోగ్యదాయకం. ముగ్గిన అరటిపండ్లు ముద్దగా చేసి చంటి పిల్లలకు కూడా తినిపిస్తారు.

అరటిపండ్లు బాగా పండాలంటే వీటిని గది ఉష్ణోగ్రతలో వెచ్చని ప్రదేశంలో ఉంచాలి. అరటిపండ్లను రిఫ్రిజిరేటర్లలో ఎప్పుడూ నిలువ ఉంచకూడదు.

●

## 'కోయెల్ కాంత్' మిక్కిలి అపురూపమైన చేప



ఆఫ్రికా ఆగ్నేయ దిక్కు తీరంలో హిందూ మహాసముద్రంలో కండపుష్టి కలిగిన రెక్కలు (Fins) కలిగిన కోయెల్ కాంత్ (coelacanth) చాలా అపురూపమైనచేప. సుమారు 60 మిలియను సంవత్సరాలకు పూర్వం పూర్తిగా అంతరించిపోయిన ఆదిమ చేపజాతికి చెందినది. కాబట్టి వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు దీనిని 'లివింగ్ ఫాసిల్' (Loving fossil) అన్నారు. 1938 లో దక్షిణ ఆఫ్రికా వద్ద ఒక సజీవమైన కోయెల్కాంత్ ను పట్టుకున్నారు. అంతవరకు అవి శిలాజములని అనుకునేవారు. 1950లో మరికొన్ని కోయెల్కాంత్లు మడగాస్కర్కు దూరంగా కొమొరో దీవులలో కనిపించాయి.

"ఉపదేశాల వల్ల కాదు, అనుభవించే కష్టాలవల్లే మానవుడు ఎక్కువ తెలుసుకుంటాడు."

# అపూర్వ విషయాలు

## హమ్మింగ్ పిట్ట ఎగురగలదు

హమ్మింగ్ పిట్ట ముందుకు, వెనకకు, పైకి




క్రిందికి ఎగురగలదు. గంట దాకా కదలకుండా గాలిలో స్థిరంగా కూడా ఉండగలదు.

* * *

## ప్రపంచంలో ఉత్తరదిక్కుకు మిక్కిలి దూరంగా నివాసయోగ్యమైన ప్రదేశం

ప్రపంచంలో ఉత్తర దిక్కుకు మిక్కిలి దూరంగా నివాసయోగ్యమైన ప్రదేశం గ్రీన్‌లాండ్‌లో ఆర్కిటిక్ వలయానికి ఉత్తరంగా 1,450 కి.మీ. దూరంలో ఉన్న డేనిష్ సైంటిఫిక్ స్టేషన్.

* * *

## ప్రపంచంలో వైర్‌లెస్ సాధన సహాయంతో పట్టుబడ్డ మొట్టమొదటి నేరస్థుడు

ప్రపంచంలో వైర్‌లెస్ సాధన సహాయంతో పట్టుబడ్డ మొట్టమొదటి నేరస్థుడు డా.క్రిప్పెన్. ఇతడు 1910 జూలై 31న SS మాంట్రోస్ మీద కెనడాకు ప్రయాణం చేస్తూండగా పట్టుకున్నారు.

* * *

## వాటర్లూ యుద్ధం వాటర్లూలో జరుగలేదు

1815 జూన్ 18న చివరిసారిగా నెపోలియన్ ఓడిపోయిన వాటర్లూ యుద్ధం వాటర్లూలో జరుగ లేదు. వాటర్లూకు 6 కి.మీ. దూరంగా జరిగింది.

* * *

## వెదురు పెరుగుతుంది!

వెదురు రోజుకి 91 సెం.మీ. ఎత్తు పెరుగుతుంది!

* * *

## సర్‌గోర్డాన్ రిచర్డ్స్ 4870 రేసులను గెలిచాడు

చాంపియన్ జాకీ సర్ గోర్డాన్ రిచర్డ్స్ 1921లో మొదటి పందెం గెలిచి తరువాత 4869 పందాలను గెలుచుకున్నాడు.

* * *

## 7 నిమిషాలలో 21 అంగుళాల కుండపోత వర్షం

ఇంగ్లండ్ ఆక్స్‌ఫర్డ్‌లో 1682 మే 31 న మేఘ విస్ఫోటనంవల్ల 7 నిమిషాలలో 21 అంగుళాల వర్షం కురిసింది! ●

"దయగలహృదయమే దైవమందిరం."

# ఇంట్రాక్యులర్ లెన్సు అంటే?

మన కంటిలోపల మబ్బుదేరి పోవడమే కాటరాక్టు. ఇది సాధారణంగా వృద్ధాప్యంలో ఏర్పడి దృష్టి మందగిస్తుంది. ఇటువంటి కంటిదృష్టిని సరిచేయడానికి ప్రస్తుతం బాగ ముదిరిన కాటరాక్టుకు శస్త్రచికిత్స చేస్తున్నారు.

మబ్బుదేరిపోయిన అక్షికటకాన్ని శస్త్రచికిత్స వల్ల తీసేస్తే దృష్టి కలిగించడానికి మంచి కటకాన్ని తిరిగి అక్కడ పెట్టాలి. దీనిని మూడు విధాలుగా అమరుస్తున్నారు. స్పెక్టికల్ (spectacle) లెన్స్ వాడటం, కాంటాక్టు లెన్స్ పెట్టుకోవడం లేక ఇంట్రాక్యులర్ లెన్స్‌ను పెట్టడం.

సాధారణంగా కాటరాక్టు ఆపరేషను తరువాత వాడే స్పెక్టికల్‌లెన్సు ప్రతిబింబాన్ని 30 శాతం పెద్దది చేస్తుంది. వస్తువులు పెద్దవిగా కనిపిస్తాయి, దగ్గరగా ఉన్నట్టు కనిపిస్తాయి. దీని వాడకంతో నిత్యజీవితంలో వస్తువులు ఉన్న దాని కంటే పెద్దవిగా కనపడడం వల్ల అనేక చిక్కులు ఏర్పడతాయి. మేడమెట్లు ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు మెట్లు సరిగా కనిపించవు. గ్లాసులో నీళ్లు పోద్దామనుకుంటే ప్రక్కగా క్రిందికి పడి పోతూంటాయి.

దళసరి అద్దాలు ఉపయోగించడంవల్ల అద్దం ప్రక్కల వక్రీభవనం ఏర్పడుతుంది. అద్దం మధ్య భాగంలో నుంచి చూసిన వస్తువులే బాగా కనిపిస్తాయి. వస్తువులు వంకరగా కనిపిస్తాయి. తలుపులు, గుమ్మాలు, కిటికీలు ప్రక్కలకు జరిగినట్లు కంటికి అనతాయి. కళ్లు కదిపితే వస్తువులన్నీ జరుగుతున్నట్లు కనిపించి దృష్టి అయోమయంగా ఉంటుంది.

ఒక కంటిలో మాత్రమే కాటరాక్టు ఉండి రెండవ కనూ బాగుంటే శస్త్ర చికిత్స తరువాత స్పెక్టికల్స్ ఉపయోగిస్తే సాధారణ కంటిలో కనిపించే వస్తువుల బింబానికి, చికిత్స పొందిన కంటి అద్దాలతో చూసే బింబానికి పొందిక ఉండదు. రెండు బింబాలు విడివిడిగా కనిపిస్తాయి.

కాటరాక్టు శస్త్రచికిత్స తరువాత దృష్టిని బాగుచేయడానికి కాంటాక్ట్‌లెన్స్ ఉపయోగించడం రెండవ విధానం. కాంటాక్టు లెన్స్ ఉపయోగం వల్ల, స్పెక్టికల్ లెన్స్ ఉపయోగం వల్ల కలిగే ఇబ్బందులను చాలావరకు తగ్గించుకోవచ్చు. కానీ కాంటాక్టు లెన్స్ పెట్టుకోడం, తీసివేయడం మరోపెద్ద సమస్య. చాలామంది వృద్ధులకు వణుకు ఉంటుంది. కాంటాక్ట్‌లెన్స్ సమంగా కంట్లో పెట్టుకోలేరు. మృదువైన కాంటాక్ట్‌లెన్స్‌ను శుభ్రం చేస్తూ స్టెరిలైజ్ చేస్తూండడం మరో సమస్య. వీటిని శుభ్రం చేయకపోతే అనేక చిక్కులు ఏర్పడతాయి.

ఇంట్రాక్యులర్ లెన్స్ ఉపయోగిస్తే స్పెక్టికల్స్ వల్ల కలిగే సమస్యలుకానీ, కాంటాక్ట్‌లెన్స్ పెట్టుకోటంవల్ల కలిగే సమస్యలు కానీ ఏవీ ఉండవు. ఇంట్రాక్యులర్‌లెన్స్ ఒక ప్లాస్టిక్ కటకము. దీనిని పాలీమిథైల్ మెథాక్రిలేట్‌తో తయారు చేస్తారు. ఇది సహజంగా కంట్లో అమరేటట్లు బయో-కంపాటబుల్‌గా ఉంటుంది. కంట్లో దీనిని అమర్చినప్పుడు కన్ను నిరాకరించదు. కంటికి ఏబాధ ఉండదు. ఆధునికమైన ఇంట్రాక్యులర్ లెన్స్‌లను కంట్లో లూప్స్‌తో అమర్చడంవల్ల ఇది జారిపోదు. ప్రతిబింబాలు పెద్దవిగా కనిపిస్తాయని, వక్రీభవనం చెందుతాయని భయం ఉండదు. ఈ సమస్యలన్నీ క్రొత్త ఇంట్రాక్యులర్ లెన్స్‌వల్ల తీరిపోతాయి. (మిగతా 62 వ పేజీలో

"అర్తి, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని ఎవరు దేనిని కోరితే దానిని ఇస్తాడు భగవంతుడు."

# విజ్ఞాన దీపిక

## ఖ్వాసార్

'ఖ్వాసార్' ఆకాశంలో ఒక బిలియను (1000 మిలియను) కాంతి సంవత్సరాల దూరంగా ఉండే నక్షత్రం వంటి ద్రవ్యము. ఇంతవరకు కనిపెట్టబడిన మిక్కిలి దూరంగా ఉండే ద్రవ్యాలు ఖ్వాసారులు. మొట్టమొదటి ఖ్వాసార్ 1959లో ఇంగ్లండులో రేడియో టెలిస్కోపు




సాధనంతో కనుగొనబడింది. ఒక సంవత్సరం తరువాత ఇదే ఖ్వాసార్ కాలిఫోర్నియాలో పలోమర్ పర్వత శిఖరం వద్ద 508 సెం.మీ.ల ఆప్టికల్ టెలిస్కోపు సహాయంతో ఫోటోతీయ బడింది. ఇవి ఆకాశంలో మిక్కిలి దూరంగా ఉండడంచేత చాలా మసకగా కనిపిస్తాయి. వీటికాంతి మనకు కనిపిస్తుంది. కానీ ఇవి మనకు కనిపించడానికి సూర్యకాంతి కంటే అనేక మిలియనురెట్ల అధికశక్తివంతమైన కాంతి కిరణాలు ప్రసరింపజేయాలి.

ఖ్వాసార్లు నిలకడగా సుస్థిరమైన శక్తివంత మగు రేడియో తరంగాలను ప్రసరింపజేస్తాయి. ఇంతవరకు విశ్వాంతరాళంలో కనిపెట్టబడిన ఇతరద్రవ్యాల కంటే ఖ్వాసార్లు అనేక మిలియను రెట్లు దట్టమైనవని రేడియో టెలిస్కోపుల వల్ల తెలిసింది. శాస్త్రజ్ఞులకు ఇంకా ఈ ఖ్వాసార్లలలో ఏమి ఉంటుందో అంతుపట్టలేదు.

* * *

(46 వ పేజీ తరువాయి)

6. భయంవల్ల సంసిద్ధత ఏర్పడుతుంది: ఎటువంటి పెద్దపెద్ద ఆపదలనైనా ప్రయత్నంతో తప్పించుకోవచ్చు.

7. భయంవల్ల విధులను వితర్కించుకో వచ్చు: భయం లేకుండా నిశ్చింతగా ఉన్నప్పుడు అవకాశాలను ఆలోచించలేవు.

8. భయం హెచ్చరిక సూచన: అమ్మకపు రిప్రజంటేటివ్‌గా ఏదైనా సమయంలో భయం కలిగితే నెమ్మదిగా ఆలోచించు. భయంపోయి ఉత్సాహం ఏర్పడుతుంది.

9. భయంవల్ల ధైర్యం ఏర్పడుతుంది: సాధారణంగా మనుష్యులలో పిసరంత భయం ఉంటే దీక్షతో పనిచేస్తారు.

10. భయం వల్ల ఆత్మ విశ్వాసం ఏర్పడు తుంది: నాటకాలలో పాత్రలు ధరించే వారికి భయంలేకపోతే వణికి పోతాడు. ఆ అదనపు శక్తి అతడికి అవసరం.

భయాన్ని పూర్తిగా అవగాహన చేసుకో. భయంతో జీవించడం నేర్చుకో. భయంతో లాభంపొందు!

—'హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో

"సామర్థ్యం లోపించినప్పుడు కాపట్యం పురోగమిస్తుంది."

## పట్టుపరిశ్రమ 4,500 సంవత్సరాలకు పూర్వం చైనాలో ప్రారంభింపబడింది

పట్టుపరిశ్రమ సుమారు 4,500 సం.లకు పూర్వం చైనాలో ప్రారంభింపబడింది. అరిస్టాటిల్



తనగ్రంథాలలో పట్టునూలు వాడకం గురించి ప్రస్తావించాడు 4వ శతాబ్దం BCలో గ్రీక్ ద్వీవకల్పం కాస్ (Cos) లో పట్టు వడకబడింది.

వట్టు పరిశ్రమ గురించి చాలాకాలం క్రిందట చైనాలో మాత్రమే తెలుసు. వారు దీనిని అతి రహస్యంగా ఉంచారు. కానీ ఇది క్రమక్రమంగా అన్నిదేశాలకు ప్రాకిపోయింది. 3 A D లో పట్టును జపాను, పర్షియా, ఈజిప్టులలో ఉత్పత్తి చేశారు. సుమారు 50 A Dలో పట్టుపరిశ్రమ యూరప్‌లో విస్తరించింది.

* * *

## మోనోరైలు

భూమి ఆధారంగా ఉండే ఒకేరైలు పట్టా మోనోరైలు. దీనిపై ప్రత్యేకంగా నిర్మింపబడిన రైలుబండి నడుస్తుంది. నిర్మింపబడిన డిజైనును బట్టి రైలు పట్టామీద నడుస్తుంది. లేక పట్టాపై వ్రేలాడుతూంటుంది. ప్రపంచంలో మొట్టమొదట మోనోరైలు 1901 లో జర్మనీలో నిర్మింపబడింది. ఈనాడు యుఎస్ఎలోను మరియు ఇతర అభివృద్ధి పొందిన దేశాలలో అనేక మోనోరైళ్లు నడుస్తున్నాయి.

* * *

## సంకరజాతి జంతువు

సంకరజాతి జంతువులు (Hybrid animals) రెండు వివిధ జాతులనుంచి జన్మిస్తాయి. సంకరజాతి జంతువులు వంశాభివృద్ధిని కలిగించలేవు. మ్యూల్ (కంచరగాడిద) మామూలు గాడిదకు, గుర్రానికి పుట్టినది. గొడ్డుజాతి జంతువు.

* * *

## భారతదేశంలో 2,680 సంవత్సరాలకు పూర్వం జింక్ లోహం పైపో టెక్నాలజీ విధానంతో శుద్ధి చేయబడింది

సుమారు 2,680 సంవత్సరాలకు పూర్వం భారతదేశంలో పైపో టెక్నాలజీ విధానాన్ని అనుసరించి జింక్‌లోహం శుద్ధి చేయబడింది. ఇటీవల 1746 లో విలియం చాంపియన్ బ్రిటన్ బ్రిస్టల్‌లో అతడి జింక్ డిస్టిలేషన్ విధానాన్ని పేటెంట్ చేసాడు. భారతదేశంలో ఈవిధానం ఎప్పుడో ఉన్నట్టు రాజస్థాన్ ఉదయపూర్‌లో జావార్ వద్ద శిథిలాలుగా కనిపించిన కొలుములనుండి తెలుసుకున్నారు. ●

### బాక్సింగ్ రాబోట్

ఈస్ట్‌జర్మనీ (జర్మన్ డెమొక్రాటిక్ రిపబ్లిక్)లో డిజైనర్లు అభివృద్ధి చేసిన ఒక రాబోటు ముష్టి యుద్ధం చేస్తుంది.

"అతికి మితికి మధ్యమార్గంలో సంతోషం స్థిరమైన శరణాలయము."

# సమస్యలు - పరిష్కారము

రాబర్ట్ స్క్యుల్లర్

దిగ్విజయాలను సాధించే సహన శీలుర రహస్యమేమిటి? అందరూ క్లిష్టపరిస్థితులకు లొంగిపోయి క్రుంగిపోతూంటే ఇటువంటి వారు వాటిని తట్టుకుని ఎలా బయటపడు తున్నారు? ఇతరులు పరాజయం పొందు తూంటే వీరు ఎలా గెలిచి రాణించగలుగు



తున్నారు? ఇతరులు మునిగిపోతూంటే వీరు ఎలా బ్రతికి బయటపడుతున్నారు?

జవాబు చాలా సులభం. వారు 'తమ సమస్యలను గ్రహించే విధానంలోనే ఉంది రహస్యం. ప్రతీ సమస్యను యధార్థ రూపంలో అనుభవ యోగ్యంగా చేబడతారు. అన్ని సమస్యలకూ ఉండే ఆరు మూలకారణాలను పూర్తిగా అవగాహన చేసుకుంటారు.

1. భూమిమీద జన్మించిన ప్రతీ మానవునికి కూడా సమస్యలు ఉంటాయి : జీవితంలో ఏ సమస్యలు లేకుండా ఎవరూ ఉండరు. సమస్యలు లేని జీవితం భ్రాంతి. ఎడారిలో ఎండమావి వంటిది. వంచించి అడ్డ దారిలో పెడుతుంది.

2. ప్రతీ సమస్యకూ కాల పరిమితి ఉంటుంది : ప్రతీ పర్వతానికి శిఖరం ఉంటుంది. ప్రతీలోయకు అఖాతం ఉంటుంది. జీవితానికి మెట్టుపల్లాలు ఎగుడు దిగుళ్ళు ఉంటాయి. ఎవరికీ ఎప్పుడూ జీవితం ఉచ్ఛస్థితిలో, నీచస్థితిలో ఉండదు. సమస్యలు వాటంతట అవే సమసి

( 11 వ పేజీ తరువాయి)

శ్రీ విశ్వేశ్వరయ్య మంచినీతిపరులు. తన కాలాన్నీ, శక్తినీ, సాధన సంపత్తినీ మిక్కిలి జాగ్రత్తగా ఉపయోగించేవారు. ప్రభుత్వ సంబంధమైన సొమ్మును అనవసరంగా స్వంతానికి వెచ్చించేవారు కాదు. రాత్రిపూట ఆఫీసు పనులైన తరువాత స్వంతపనులకు తన దీపాలనే వెలిగించుకొనేవారు. ఒకసారి ప్రభుత్వం వారికి రిజిగ్నేషన్ ఉత్తరం ఇవ్వడానికి ప్రభుత్వంవారి కారులో వెళ్లి తిరిగి రావడానికి తన కారును సిద్ధంగా ఉంచుకున్నారు.

శ్రీ విశ్వేశ్వరయ్య గొప్ప ధైర్య శాలి. అనేక సమస్యల విషయంలో బ్రిటిషు పాలకులకు గానీ, భారతీయనాయకులకుగానీ తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా చెప్పగలిగే వారు. క్రమశిక్షణకు మిక్కిలి ప్రాధాన్యం ఇచ్చే వారు. సోమరితనం ఎప్పుడూ సహించలేరు. కాల నియమాన్ని పాటించాలని చెప్పేవారు. ఒకసారి అనుకున్న సమయానికి 5 నిమిషాలు ఆలస్యంగా వచ్చిన ఇంజనీరుని చూడలేదు.

102 సంవత్సరాలు పరిపూర్ణ ఆయుర్దాయంతో జీవించి, చివరి క్షణంవరకూ చురుకుగా పనిచేస్తూనే ఉండేవారు.

"ఒకరి దోషం చూసి పరిహాసం చేయడానికి ప్రారంభించకు, నీదోషం ఇతరులకు మరీ పెద్దదోషంగా కనిపిస్తుంది."

పోతుంటాయి. సమయం వచ్చినప్పుడు సమస్యలు పరిష్కార మవుతాయి.

ప్రతీ సమస్యకు జీవిత కాల పరిమితి ఉన్నట్టు చరిత్రవల్ల తెలుస్తూంది. ఏ సమస్య కూడా స్థిరమై ఉండదు. సమస్యలు గతించిపోతాయి. వర్షాలు కురిసిన తరువాత సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తాడు.

3. ప్రతీ సమస్య ఆశాజనకంగా పరిణ మించే అవకాశం ఉంది: ఒక - వస్తువును రహస్యంగా ఉంచడం పరమాత్ముని దివ్య ప్రభావం. ప్రతీ సమస్యలోను సృజనాత్మక శక్తి నిబిడమై ఉంటుంది. ఈ శక్తి నీకైనా ఉపకరించవచ్చు, లేక ఇంకొకరికి ఉపక రించవచ్చు.

ఒకరి క్లిష్ట సమస్య ఇంకొకరి సదవకాశం. రోగులున్నారు కాబట్టే హాస్పిటళ్లు బయలు దేరాయి. మానసిక దౌర్బల్యం వల్లనో లేక తెలియక నేరాలు చేస్తారు. కాబట్టే లాయర్ల వ్యాపారం కొనసాగుతూంది.

4 ప్రతీ సమస్య నీలో మార్పును కలిగిస్తుంది: మనను పట్టుకున్న సమస్యల వల్ల మనిషి మారతాడు. ప్రతీ వ్యక్తి కూడా సమస్యలతో సతమతమవుతాడు. సమస్యల చిక్కులో ఇరుక్కుపోయిన వారు మార్పుచెందకుండా ఉండలేరు.

5. నీ సమస్య నీకెలా పరిణమిస్తూందో నీవు తెలుసుకోగలవు: సమస్యలను, కష్టాలను నీవు ఆహ్వానించి కోరి తెచ్చుకోక పోవచ్చు. కానీ సమస్యలవల్ల నీవెలా మార్పు పొందు తున్నావో తెలుసుకోవచ్చు.

జీవితంలో అసాధ్యం అని అనిపించే సమస్యల పరిణామాన్ని స్వాధీనం చేసు కుంటే వాటివల్ల కలిగే ఫలితాలను నియంత్రించుకోగలవు. సమస్యకు నీవు చెందే పరిణామమే ముఖ్యం. దానివల్లే నీవు దయార్ద్ర హృదయుడవు కావచ్చు లేక కఠిన చిత్తుడవు కావచ్చు. జీవితం మధుర మయమైనా, చేదు విషమయ మైనా అంతా నీలోనే ఉంది.

6. ప్రతీ సమస్యకి ధనాత్మకమైన ప్రత్యాశాభావం ఉంటుంది: కష్టాలు కలకాలం ఉండవు. ఓర్పు, పట్టుదల గలవారు విరమించరు. ఇటువంటివారు జీవితంలో ఎటువంటి గడ్డు సమస్యలు వచ్చినా అవలీలగా సమాధాన పరచుకోగలుగుతారు. అదేవాస్తవ మైన రహస్యం.

'ఇది మానవుని వల్ల సాధ్యంకాదు. పరమాత్ముని సహాయంతో అన్నీ సాధించ గలం' అని అనుకుంటే ప్రతీ సమస్య సులభంగా తీర్చుకోవచ్చు. ●

## గ్రంథాలు-గ్రంథరచయితలు


RUDYARD KIPLING

| | |
|---|---|
| డా.జివాగో | - బోరిస్ పాస్టెర్‌నాక్ |
| బెల్-అమీ | - గుయ్ డి మపాస్సాంట్ |
| క్రై, ది బిలవ్‌డ్ కంట్రీ | - అలాన్ పాటన్ |
| కిమ్ | - రుడ్ యార్డ్ కిప్లింగ్ |
| క్రైమ్ అండ్ పనిష్‌మెంట్ | - ఫీడోర్ డోస్టోయేవ్‌స్కీ |

"పనిశేషం, శత్రుశేషం, ఋణశేషం ఆరని నిప్పులాంటివి."

# ఆర్మ్‌స్ట్రాంగ్ వ్యోమ ప్రదర్శనశాల

జూలై 20, 1969 రాత్రి సరిగ్గా 10.56 గంటలకు నీల్‌ఆర్మ్‌స్ట్రాంగ్ బూడిదరంగుతో దుమ్ముమయమైన చంద్రమండలంమీద ఎడమ పాదాన్ని పెట్టాడు. అప్పుడు మానవునికి అత్యల్పమైన ఒక చిన్న అడుగైనా మానవజాతికి ఇదొక అద్భుతమైన ముందంజ అని అంతరిక్ష యోధుడు ఆర్మ్‌స్ట్రాంగ్ అన్నాడు.



ఆగష్టు 1930లో ఓహియోలో దక్షిణ దిక్కుగా ఉన్న ఒక చిన్న వ్యవసాయ కుటుంబానికి చెందిన ఇంట్లో ఆర్మ్‌స్ట్రాంగ్ జన్మించినప్పుడు ఓహియోలోని వాపకోనేటా పట్టణంలోని ప్రజలందరికీ ఈ సుప్రసిద్ధ చరిత్రతో సంబంధం ఏర్పడిందని చెప్పుకోవాలి. చిన్నతనంలో మూడు మోటార్లు ఏర్పాటు చేసిన ఒక విమానంలో 20 నిమిషాల వాయుప్రయాణం చేసిన ఆర్మ్‌స్ట్రాంగ్‌కి అంతరిక్షంలో ప్రవేశించి అక్కడ అద్భుతాలను తెలుసుకోవాలనే అభిలాష రేకెత్తింది. నిజంగా జూలై 20, 1969న ఏంజరుగనున్నదో తెలియకుండానే ఆర్మ్‌స్ట్రాంగ్ తన 16 వ ఏట స్టూడెంట్ పైలట్ సర్టిఫికేటును పొందాడు.

ఈనాడు అతని స్వగ్రామం ఓహియోలో ఒక మిలియను డాలర్ల వ్యయంతో బ్రహ్మాండమైన నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ వాయు మరియు 'వ్యోమ ప్రదర్శనశాల' ఉద్భవించింది. 14,000 చదరపుటడుగుల వైశాల్య ప్రదేశంలో వివిధ ఆకారాలలో అరుగులు, త్రోవలు ఇతర నిర్మాణాలు ప్రేక్షకులకు వింత కలిగిస్తాయి. ప్రేక్షకులు క్రిందికి గోతులలో చూస్తారు. పైన వ్రేలాడుతున్న విమానాలను చూస్తారు. ప్రక్కలలో గల దారులలో అనేకరకాల అంతరిక్షపు సరంజామాను చూస్తారు. పెద్దపెద్ద సొరంగాలలోకి ప్రవేశిస్తారు. చిన్నచిన్న గోడలను దాటుతుంటారు.

తెల్లని పెద్ద డోము క్రింద ఆస్ట్రో థియేటరులో 7 ప్రొజెక్టర్లు అనేక ధ్వనివర్థక యంత్రాలు మధ్య ప్రేక్షకులు అంతరిక్షానుభూతిని పొందుతారు. ఆర్మ్‌స్ట్రాంగ్ ప్రదర్శనశాలలో ప్రేక్షకులను మోహింపజేసే అనేక అద్భుత వస్తువులు ప్రదర్శింపబడుతున్నాయి. అనేక చిత్రాలు, ఫొటోలు, ఫిల్ములు చూపిస్తారు. ఇవన్నీ ఓహియో అంతరిక్ష సాధనాలను పూర్తిగా ప్రదర్శిస్తాయి. 19 మరియు 20 శతాబ్దపు ప్రథమదశలో బెలూను ప్రయోగాలు, విల్‌బుర్, ఆర్విల్లీ రైటుల వాయు విమానాలు, అపోలో 11 అంతరిక్షయాత్ర, నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రమండలంపై కాలుమోపడం వంటి అనేక ఆశ్చర్యకరమైన విషయాలు ప్రదర్శింపబడతాయి.

—'ది రొటేరియన్' సౌజన్యంతో

"నీతులు చెప్పేవారు వాటిని ఆచరించకపోతే ప్రయోజనం లేదు."

# సహస్ర చంద్ర

మానవజన్మ ఉత్కృష్టమైనది. మానవ జన్మ పూర్వజన్మ సుకృతంవల్లే లభిస్తుంది ఇట్టి మానవుల ముఖ్య లక్ష్యము జన్మ రాహిత్యం కలిగించుకోవడం. ఈ ముఖ్య లక్ష్య సాధన వల్ల 'మోక్షం' లభిస్తుంది. అదే 'వైకుంఠ ప్రాప్తి' దీనినే 'జీవబ్రహ్మైక్యం' అంటారు అసలు మానవుడు ఎలాపుట్టాడో అలాగే మరణిస్తున్నాడు ఈ జనన మరణాల మధ్య మానవుడు అనేక కష్ట సుఖాలను అనుభవిస్తాడు వరుసగా శైశవం, బాల్యం, యౌవ్వనం, ప్రౌఢం, వృద్ధాప్యం అనే అయిదు అవస్థలను పొందు తాడు ఈ అయిదు అవస్థలు అనివార్యమే వీటిని మానవుడు అనుభవించి తీర వలసిందే. శైశవంలోను, బాల్యంలోను హిత మనిపించే పరిసరము, రక్షణ, ప్రీతి, అను రాగము, చేతులు, కాళ్లు ఆడించడానికి అవకాశము, బట్టల మార్పిడి, సమయాసమ యానికి పుష్టికరమైన ఆహారం ఇవన్నీ సక్రమంగా జరిగిపోతూంటే శైశవం సాఫీగా జరిగి పోతుంది. ఈ అవస్థలో పెరుగుదల తీవ్రంగా ఉంటుంది ఇదేవేగంతో మనుష్యులు, యౌవ్వనం వరకూ పెరిగితే మనుష్యుల రూపం ఎలా ఉంటుందో వేరే చెప్పాలా? రాక్షస రూపం వస్తుంది శైశవంలోను, బాల్యంలోను కాలం చాలా కుతూహలంగా గడిచిపోతుంది అసలు ఇతర ప్రాణులతో సరిపోలిస్తే మానవులు స్వాతంత్ర్యం పొందడానికి చాలాకాలం పడుతుంది ఇతర ప్రాణులు కొన్ని వెంటనే, కొన్ని గంటలలో, కొన్ని రోజులలో, కొన్ని వారాలలో తమకాలి మీదతాము నిలుచుండి ఆహారం వెతుక్కో డానికి ఉపక్రమిస్తాయి. కానీ మానవుడు శైశవం, బాల్యం దాటిన తరువాత తన ఆహారం తాను సంపాదించుకోడానికి ఎన్ని సంవత్సరాలు కావాలో! పుట్టిన బాబు సుమారు 3 నెలలకు బోర్లపడి, అటుఇటు ప్రాకడానికి ప్రయత్నిస్తాడు. 7,8 మాసాలు వచ్చేటప్పటికి కూర్చోడం, 10వ మాసం వచ్చేటప్పటికి నుంచుని, అడుగులు వేయడం ప్రారంభిస్తాడు. మాట్లాడటం కొంద రికి త్వరగాను, కొందరికి ఆలస్యంగాను వస్తుంది దైహికంగా ఒక్కొక్కరి పెరుగుదల ఒక్కొక్క రీతిగా ఉంటుంది మనోధర్మాలలో మార్పులు ఏర్పడుతూంటాయి ఇవన్నీ అను వంశికంగా ఏర్పడతాయి.

పసిపిల్లలలో దైహికంగా పునఃశ్చేతన శక్తి చాలా అద్భుతంగా ఉంటుంది పైనుంచి క్రిందపడి తలకి ఎంత పెద్ద దెబ్బ తగిలినా

## నీ నిధులను లెక్కపెట్టుకో



పువ్వులతో నీతోటను నిలువకట్టు
పండిరాలిన ఆకులతో కాదు-
అమూల్యమైన బంగారు మడియలతో
నీవుగడిపిన రోజులను లెక్కపెట్టు.
నీవు గడిపిన రాత్రులు నీడలతో కాదు-
ప్రకాశించే నక్షత్రాలతో లెక్కపెట్టు.
ప్రతీ జన్మదినం సంతోషంగా గడిపిన
సంవత్సరాలతో కాదు. స్నేహితులతో
నీవయస్సును లెక్కకట్టు.

"నీస్వభావం నీమాటతీరునిబట్టి ఉంటుంది."

తట్టుకో గలుగుతారు తలమెత్తగా ఉంటుంది ఆరోగ్యం త్వరగా చేరుకుంటుంది పెద్దవారిలో ఇది సాధ్యంకాదు యౌవ్వనంలోకి వచ్చేటప్పటికి దైహికంగా అనేక మార్పులు కనిపిస్తాయి మగ పిల్లలకు గడ్డాలు, మీసాలు వస్తాయి ఆడపిల్లలు ఋతుమతులు అవుతారు ఇటు వంటి మార్పులు అనేకం ఏర్పడతాయి ఇక ప్రౌఢవయస్సులో మానవులు పరిసరాను గుణ్యంగా బాంధవ్యాన్ని ఏర్పరచుకుంటారు ధార్మిక, సామాజిక, వైజ్ఞానిక, సాహిత్య క్షేత్రా లలో తగిన పాత్ర నిర్వహిస్తారు దైహిక మానసిక సామర్థ్యాలు ఈ కాలంలో అత్యున్నత స్థితిలో ఉంటాయి స్త్రీలలో సుమారు 50 సంవత్సరాలకు అండాణువులు ఉత్పాదన తగ్గిపోతుంది ఈ వయస్సులో స్త్రీ పురుషులకు వృద్ధాప్యం ఏర్పడుతుంది

వృద్ధాప్యం లేక ముసలితనం అంటే ముందుగా నెరిసిన జుట్టు, ముడతలు పడి పోయిన చర్మం, కుదించుకుపోయిన శరీరము, వినిపించని చెవులు, కనిపించని కళ్లు, నరాల బలహీనత ఏర్పడుతుంది అసలు 25-80 సంవత్సరాల మధ్య స్త్రీలు, పురుషులు కొంత ఎత్తు తగ్గిపోతారని ఫ్రాన్స్‌లో జరిగిన సమీక్షలో తెలిసింది శరీరంలో ఎంజైముల ప్రభావం తగ్గిపోతుంది ఈవిధంగా దేహంలో అనేక పరిణామాలు ఏర్పడతాయి సామర్థ్యం క్షీణించిపోతుంది

అనుభవించవలసిన వృద్ధాప్యంలో మానవుడు ఎన్నెన్నో సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది సాధారణంగా వృద్ధాప్యంలో అశక్తత ఏర్పడుతుంది వృద్ధులకు దురవస్థ, దుఃఖం అధిక మవుతుంది ఇంట్లో యువకులకు ఇటువంటి వృద్ధులు భారం అనిపిస్తారు యువకులైన కొడుకు, కోడలు ఉద్యోగం చేసుకునే రోజులివి ఇటువంటి ఇంటిలో వృద్ధుడైన పెన్షన్ దారుడు - తండ్రి డబ్బు పెట్టుకుని అతిథిగా ఉండవలసివస్తుంది వృద్ధురాలైన తల్లి జీతబత్తాలు లేని పనిగత్తెగా ఉండవలసి వస్తుంది

ఏదైనా జీవితంలో ఏర్పడే అన్ని సమస్యలకు మనస్సే ముఖ్యకారణము వృద్ధులు నిశ్చింతగా నెమ్మదిగా కాలం గడుపుకోడానికి అనుకూల వాతావరణాన్ని ఏర్పరచు కోవాలి ఎదురయ్యే

**క్విజ్-జవాబులు** : 1. (సి) 24 అక్షరాలు, 2. (సి) సేలం, 3. (సి) విశ్వేశ్వరయ్య 4. (డి) కేరళ, 5. (సి) కంబన్, 6. (డి) ఒరిస్సా, 7. (బి) (Mrs) [illegible], 8. (డి) ఉండాలి గానీ స్వంతదారులు లోకం శ్రేయస్సుకోసం ట్రస్టీగా ఉంటూ దీనిని ఉపయోగించాలి.

**తెలివికి పరీక్ష-జవాబులు** : 1 (159) (258) (357), 2. ఓంకారము, 3. ఆరు రోజులు, 4. దంత వైద్యులను, 5. సందేహం, 6. ఋక్కు, యజుస్సు, సామము, అథర్వణము అనే వేదాలు - నాలుగు.

**మాటల మహిమ-జవాబులు** : 1. [illegible] (ఎ), అపహరించు (బి); 2. వస్త్రముగట (ఎ), పుట్టు (బి), తోట (సి), ముదురు ఎరుపు (డి); 3. అందము (ఎ), శక్తికలది (బి), అనురాగము (సి); 4. [illegible] (ఎ), విస్మృతి (బి), [illegible] (సి), అల్పము (డి); 5. పడమరవ భాగము (ఎ), మిక్కిలి తక్కువ భాగము (సి); 6. తెల్లవారు (ఎ), వృద్ధి (బి), బాధపడు (సి); 7. బంధుత్వము (ఎ), క్రమము (బి), తుల్యత (సి); 8. దుఃఖము (ఎ), శోకము (బి), కీడు (సి).

"ఆహారశుద్ధి వలన భావశుద్ధి ఏర్పడుతుంది."

సమస్యలు ఎన్నైనా ఉండవచ్చు. వృద్ధులు వాటిని చిరునవ్వుతో ఎదుర్కోవాలి. మానసికంగా నిత్యనూతన ఉత్సాహాన్ని, శారీరకంగా నవచైతన్యాన్ని ప్రవృద్ధి చేసుకుంటూండాలి. సదాచారము, మితాహారము, మితభోగము, పారిశుద్ధ్యముతో జీవితంలో సంభవించే అన్ని విషయాలు మన మంచికొరకే అనే మనస్తత్వంతో చీకూచింతా లేకుండా సంతోషంగా కాలం గడపటం అలవాటు చేసుకోవాలి. వృద్ధులమవుతున్నామనే మనోవ్యధవల్లే ఎక్కువగా చింత ఏర్పడు తుంది, వాస్తవంగా వృద్ధాప్యం వల్లకాదు. వృద్ధాప్యం విలాసవంతం చేసుకోడం అంత కష్టం కాదు. శక్తికి అనుకూలంగా వ్యాపకాలు కలిగించుకుంటూ క్రొత్తక్రొత్త అభిరుచులను పెంచుకుంటూంటే వృద్ధాప్యం ఆనందంగా గడిచిపోతుంది.

సాంప్రదాయకంగా మన పూర్వీకులు ధర్మ శాస్త్రం ప్రకారం మానవ జీవితంలో ఆయా అవస్థలకు తగినట్టుగా బారసాల, అక్షరాభ్యాసం, ఉపనయనం, వివాహం మొదలైన వేడుకలు, సంబరాలు నిర్ణయించారు. ఇదేవిధంగా వృద్ధాప్యంలో కూడా వృద్ధులు ఆనందంగా జరుపుకోడానికి కొన్నివేడుకలు సంబరాలు ఉన్నాయి. ఇవన్నీ ధర్మశాస్త్రంతో ముడివడి ఉన్నాయి.

మానవుని జీవిత కాలం 100 సంవత్సరాలు అని నిర్ణయింపబడింది. ఈ నూరు సంవత్సరాల వయస్సులోను వరుసగా 6 0,70,80,90 వయస్సులలో యమధర్మరాజు భటులను పంపి మరణాన్ని జ్ఞాపకం చేయిస్తూంటాడు. ఇదే 'అపమృత్యువు' అంటారు. ఈ అపమృత్యువు ఉగ్రరథ, భీమరథ, విజయ రథ అనే పేర్లతో వృద్ధుని భయపెడుతూంటాయి. ఈ అపమృత్యు నివారణకు మన శాస్త్రాలు కొన్ని పౌష్టిక కర్మలను ఆదేశించారు. ఈ

## ప్రపంచంలో భయంకరమైన భూకంపం



*ప్రపంచంలో మిక్కిలి భయోత్పాతకమైన భూకంపం జూలై 1201 లో ఏర్పడింది. ఈ భూకంపంవల్ల నియర్ ఈస్ట్ మరియు ఈస్టర్న్ మెడిటరేనియన్ నగరాలన్నీ కంపించి పోయాయి. 11,00,000 మంది జనం మరణించారు.*

( 54 వ పేజీ తరువాయి)

ఈలెన్సులు పెట్టుకున్నవారు చదువుకోడానికి మాత్రం రీడింగ్ గ్లాసులు పెట్టుకోవలసి వస్తుంది. 1970 నుండి యునైటెడ్ స్టేట్స్‌లోను, గత 5 సంవత్సరాలనుండి భారతదేశంలోను ఇంట్రాక్యులర్ లెన్సులను ఉపయోగిస్తున్నారు. అనేక మందికి ఇవి చాలా సంతృప్తి కరంగా ఉన్నాయి. కానీ కాటరాక్టుతోపాటు ఐరిటిస్ (Intıs), నియంత్రణకు వీలులేని గ్లాకోమా మరియు మధుమేహంవల్ల రెటినోపతీ వంటి కంటిరోగాలు ఉన్నవారు మాత్రం ఇంట్రాక్యులర్ లెన్స్‌ను పెట్టుకోడానికి వీలుండదు.

— 'రోటరీ న్యూస్' సౌజన్యంతో

"సులభమార్గంలో సాధించాలనుకోడం ఆత్మవంచన."

పౌష్టిక కర్మలే వృద్ధాప్యంలో జరుపుకునే ముచ్చటలు. ధర్మశాస్త్రంలో విధింపబడిన ఈ పౌష్టిక కర్మలు వృద్ధులు ఆయుస్సు వృద్ధికి చేసుకోవలసిన శాంతులు. శౌనక మహాముని వీటికి ధర్మాలను నిర్ణయించాడు. వీటిని బట్టి శాంతి రత్నాకరము, శాంతి కుసుమాకరము అనే గ్రంథాలు రచింపబడ్డాయి.

60వ సంవత్సరం వయస్సులో షష్ట్యాబ్ది పూర్తి శాంతి, 70వ సంవత్సరం వయస్సులో భీమరథశాంతి, 80వ సంవత్సరం వయస్సులో శతాభిషేకశాంతి చేసుకోడం ధర్మవిధి. సాంప్రదాయకం కూడా. షష్ట్యాబ్ది పూర్తి శాంతి, భీమరథ శాంతి సరిగా6 0,70 సంవత్సరంలో జన్మనక్షత్రం రోజున జరుపు కుంటారు. శతాభిషేకము 1000 పౌర్ణిమలు అంటే (వెయ్యిసార్లు పౌర్ణమి దినాలు చూచిన తరువాత) సహస్ర చంద్ర దర్శనం అయిన వెంటనే సుమారు 83వ సంవత్సరంలో జరుపుకుంటారు. శతాభిషేక శాంతిని గురించి, బోధయిన గృహ్య సూత్రాలలో వివరింపబడింది. మానవులకు ఇది చాలా ముఖ్యమైన శాంతి. జరుపుకుని తీరాలి. మన జీవితకాలం 100 సంవత్సరాలు. ప్రతీవ్యక్తి కూడా భగవంతుడు ప్రసాదించిన 100 సంవత్సరాలు జీవించడానికి ఉద్యమాలు సాగించాలి. ఎదుర్కొంటూన్న వృద్ధాప్యాన్ని మరచిపోయి గత జన్మలో చేసిన పాపాలు పోగొట్టుకోడానికి, జీవ బ్రహ్మైక్యం పొందడానికి ఈ శాంతులు అవసరం.

ఈ శాంతులకు కలశప్రతిష్ఠ, హోమాలు, దానాలు ఆచరించాలి. శింశుమార, లక్ష్మీ నారాయణ, ధన్వంతరి, మృత్యుంజయ, మార్కండేయ దేవతలకు ఐదుగురుకి ఐదు కలశాలు పెడతారు. కలశ సన్నిధిలో వేద పారాయణం జరిపిస్తారు. కలశస్థాపన తరువాత విజయరథ శాంతి హోమం, చేస్తారు. హోమాలలో ముఖ్యంగా నవగ్రహహోమం, అష్టదిక్పాలక హోమం, మృత్యుంజయ హోమం చేసిన తరువాత జన్మనక్షత్ర దేవత హోమం జరిపిస్తారు. పునఃపూజానంతరము దానాలు ఇస్తారు.

—వాధూల

## కొండలు, రాతిబండలు పగిలిపోకుండా ఉండడానికి త్రాటివలలు



పర్వత ప్రదేశాలలో పెద్ద పెద్ద కొండలు, రాతి బండలు పగిలి జారిపడుతూంటాయి. ముఖ్యంగా హిమాలయ పర్వత ప్రదేశాలలో ఈ జారుడువల్ల అనేక ఇళ్లు కూలిపోతూంటాయి. సాలీనా వాటి రిపేర్లకు సుమారు రూ2000 మిలియను ఖర్చు అవుతూంది. ఢిల్లీలో సెంట్రల్‌రోడ్ రీసెర్చి ఇన్స్టిట్యూట్‌లో జరిపిన ప్రయోగాలలో చాలాచోట్ల భూస్తరణాలవల్ల రాతితలంపైకి వచ్చి రాతి జారుడులు కలుగుతున్నాయని తెలుసుకున్నారు. దానికి పరిశోధకులు అస్థిరమైన ఏటవాలు ప్రదేశాలపై పీచు వలలను కప్పారు. దీనివల్ల ఇప్పుడు ఉంటూన్న కొండలు, రాతిబండలు విరిగి జారిపోవు. పైన మొక్కలు బయలుదేరతాయి. దీనివల్ల వర్షాలవల్ల భూమికి దెబ్బతగలదు. భూస్తరణాంతర్గ కొండలు రాతిబండలు జారడానికి అవకాశం ఉండదు.

—'సిఇఇ.ఎస్.ఎఫ్.ఎస్' సౌజన్యంతో

"గతించిన దానికి విచారించి లాభంలేదు, జరుగబోయే కాలం ఎలాంటిదో తెలియదు. వర్తమానమే భవిష్యత్తుకి పునాది."

# తెలుసుకోదగ్గ విషయాలు

## ప్రపంచంలో మొట్టమొదటి మోటారు పందెం

ప్రపంచంలో మొట్టమొదటి మోటారు పందెం ఏప్రిల్ 20, 1887 న పారిస్‌లో సీన్ (Seine) నదీ తీరం మీద నిర్వహించబడింది.

* * *

## క్లియోపాత్రా సమాధి 1890లో కనుగొనబడింది




ఈజిప్టు మహారాణి క్లియోపాత్రా (69-30 బిసి) సమాధి 1890లో కనుగొనబడింది.

* * *

## ఇంగ్లండ్ దేశపు మిక్కిలి చిన్న ప్రైమ్‌మినిష్టరు

విలియంపిట్ ఇంగ్లండు దేశపు మిక్కిలి చిన్న ప్రధానమంత్రి. 24వ సం రం వయస్సులో పదవిని స్వీకరించాడు. ఇతడు 1806లో 47 సంవత్సరాల వయస్సులో మరణించాడు.

* * *

## చంద్రమండలం మీద దిగిన మొదటి సోవియెట్ వ్యోమనౌక

లూనా 9, 1966 లో చంద్రమండలంమీద దిగిన మొట్టమొదటి సోవియెట్ వ్యోమనౌక.

* * *

## మొట్టమొదటి కాన్‌కర్డ్ వాయువిమానం

మొట్టమొదటి కాంకర్డ్ (concorde) వాయు విమానం శబ్దాతీతమైన సూపర్ సోనిక్ వేగాలతో 1969లో ఫ్రాన్స్ మీదుగా ప్రయాణం చేసింది.

* * *

## విజయవంతమైన మొట్టమొదటి అంతర్జాతీయ వైర్‌లెస్ మెసేజ్

ఇటలీదేశపు నవ్యవస్తు కల్పనా చతురుడు, సుప్రసిద్ధ భౌతిక శాస్త్రజ్ఞుడు గుగ్లి ఎలెమో మార్కొనీ 1901 లో విజయవంతంగా మొట్ట మొదటి అంతర్జాతీయ వైర్‌లెస్ మెసేజ్‌ను ఇంగ్లండు కార్న్‌వాల్ నుండి అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా కెనడాలో న్యూఫౌండ్ లాండ్‌కి పంపాడు.

"సత్కర్మలూ, దుష్కర్మలూ వెంటాడే నీడలు."

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT

*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084)*

